# ప్రసన్నయాదవము

గ్రంథకర్త:

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు.

ప్రకాశనకర్త:

కురుకూరి సుబ్బారావు

సరస్వతీ బుక్కుడిపో,

బెజవాడ.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1935

రిజిష్టర్డు]

[వెల రు ~~0—8—0~~.

# ప్రసన్నయాదవము

ఇది

చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారిచే

రచియింపఁబడినది.



పబ్లిషరు:

మేరుకూరి సుబ్బారావు

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.



కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

1934

ట్]　　　　[వెల 0—8—0.

# ఈనాటకమునందువచ్చు పాత్రలు.



## పురుషులు.

మహేంద్రుడు—దేవతలరాజు

బృహస్పతి—దేవగురువు.

జయంతుడు—మహేంద్రుని కుమారుడు.

మాణిభద్రుడు—కుబేరుని సేవకుడు.

నరకాసురుడు—ప్రాగ్జ్యోతిషాధిపతియగు రాక్షసరాజు.

పంచజనుడు, నిశుంభుడు, మురుడు—నరకాసురుని సేనాధిపతులు

వ్రజకంఠుడు, మందపాలుడు—నరకాసురునిబంట్లు.

సూతుడు—నరకుని సారథి.

భగదత్తుడు—నరకాసురునికుమారుడు.

శంబరుడు—నరకాసురుని మంత్రి.

శుక్రాచార్యులు—రాక్షసగురువు.

చిత్రరథుడు—గంధర్వుడు.

పులహుడు, బృహదశ్వుడు—బదరికాశ్రమమునులు.

దారుకుడు—కృష్ణునిసూతుడు.

దేవలుడు—కృష్ణుని యంతఃపురపరిచారకుడు.

శ్రీకృష్ణుడు—కథానాయకుడు.

## స్త్రీలు.

ఊర్వశి—స్వర్గలోకవేశ్యకాంత.

సత్యభామ—శ్రీకృష్ణునిదేవి.

శ్రీ

# ప్రసన్న యాదవ నాటకము.



## నాంది.

మ. మును లాస్థానకవీంద్రు; లాగమచయంబు ల్వాందిబృందంబు; స
జ్జనచిత్తంబులు కొల్వుకూటములు; సంద్రంబు ల్ధనాగారము;
ల్మనుజు ల్సేసెడి సేవ యుప్పనము; బ్రహ్మాండంబు సామ్రాజ్య మె
వ్వని కాయాదినుచక్రవర్తి కృపఁ గాపాడు స్సభాస్తారులన్.

మఱియు,

తే. గీ. ప్రాణికోటులనెల్లఁ బాత్రములఁ జేసి
జగ మనెడు మహారంగ దేశంబునందు
నాటకంబుల నేర్పుతో నడపునట్టి
సూత్రధారుండు మిముఁ బ్రోచు శుభము లొసఁగి.

సూత్రధారుఁడు—[నాంద్యనంతరమున తెరసంకఁ జూచి] పారిపార్శ్వకా! నీవొకసారి యిటు రాఁగలవా ?

పారిపార్శ్వకుఁడు—[ప్రవేశించి] అయ్యా! ఇదిగో వచ్చియున్నాఁడను. నేనేమి జేయవలసియున్నది ?

సూత్ర—ఓయీ ! సాయంకాలమునుండి ప్రయత్నము జేయుచున్నను నీవిప్పటికిని రంగకృత్యమును సిద్ధముచేయలేకపోతివా ?

పారి—అయ్యా ! మీరు నిష్కారణముగా నాపై నేరము మోపుచున్నారు. అంతయు నీవఱకే సిద్ధమయి యున్నయది. సభాసదులతో మనముఁ బ్రయోగింపఁబోవు రూపకమును గూర్చి మీరు చెప్పవలసినది చెప్పకపోవుటయే యాలస్యము.

సూత్ర—ఏమీ! నాదే యాలస్యమా? అట్లయిన నిదిగో చెప్పుచున్నాఁడను. రసికశిఖామణు లగునోసభాసదులారా! విద్వజ్జనవిధేయుఁ డగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహాకవిచేత నాంధ్రభాషలో రచియింపఁబడిన ప్రసన్నయాదవ మనువీరరస ప్రధానరూపకమును, మే మీరాత్రి యిచ్చటఁ బ్రయోగింపఁదలఁచుకొన్నారము. కావున మీరు సావధానులరయి చిత్తగింతురు గాక!

పారి—అయ్యా! ఈ నాటకగుణాగుణంబులం గూర్చి యించుకేనియుఁ జెప్పవైతివేమి?

సూత్ర—దానిఁగూర్చి చెప్పఁదగినవాఁడను నేను గాను.

మ. కవి సౌవర్ణికి, కృతు ల్నగ, ల్కథయె బంగారంబు, శ్లేషాది స
త్కవనంబు ల్నగిషీపను, ల్రసదలంకారంబు లుద్యన్మణీ
నివహంబు; ల్ప్రతిపేటిక యెట్టిదియొ, తన్నిర్మాత నే ర్పెట్టిదో
వివరింపఁదగు నాటకాంశము గద! యుర్విన్ బండితగ్రామణుల్.

పారి—ప్రబంధ మెట్లున్నను బ్రయోగకుశలుర మగుమనము సభాసదుల రంజింపఁ జేయఁగలమని నేఁ దలంచెద.

సూత్ర—ఓపండితమ్మన్యా! గర్వోక్తులతో నేమి ప్రయోజనము?

క. తనరూపము, తనవిద్యయుఁ
దన నేర్పును దనగుణంబు దనగానము, గ
న్గొని యెవఁడు సంతసింపఁడు?
తనవిషయము నెంచ నొరులె తగువారుసుమీ!

మఱియు నీ వనినయట్లు మనము ప్రయోగకుశలులమే యయిన నంతమాత్రమున సభాసదులు సంతసిల్లరు, ఏమనిన—

ఉ. కృతి రసవంతమయ్యు నది కింపొనఁగూర్పదు నాటకు ల్పను
ల్రత మెయి నాదకుండినఁ; బ్రదర్శకు లెల్లఁ బ్రయోగపద్ధతి
జ్ఞతురులె యైన నేమి కృతి చప్పని దైనఁ; బ్రయోగము
న్మతియును మంచిదైనపుడె నిండుముదం బగుఁ జూచువారికిన్

పారి— అట్లయిన గ్రంథచమత్కృతియుఁ బ్రదర్శకులసామర్థ్యముఁ గనిపెట్టుటకు సభాసదులు మాత్రము నేర్పరులయి యుండవలదా ?

సూత్ర—ఓయీ! ఇటు వినుము.

తే. గీ. కవియు నాటకు లేర్పరుల్గావలయును
సభ్యు లగువార లెప్పుడు చతురమతులె
వంటకత్తియ జాణ గావలయుఁ గాక!
తినెడువారికిఁ దద్రుచు దెలియకున్నె ?

పారి—సరే! చతురమతు లయినసభాసదు లందఱు కావ్యమునందును మన ప్రయోగమునందును గల గుణమ్ములు గ్రహించి యానందింతురు గాక !

సూత్ర— గుణగ్రహణపారీణులే యట్లు జేయుదురు. తదితరులు దోషాన్వేషణముఁజేయుచుందురు. అయినను నీ నాటకమును బ్రయోగించునపు డెల్లసభాస్తారులతో నిట్లు మనవిజేయుమని కవి యాన తిచ్చియున్నాఁడు.

తే. గీ. సత్కవి యొనర్చు కావ్యంబు సరసువోలె
స్వచ్ఛమై రసవంతమై సౌఖ్యద మగుఁ
గుటిలధీవరు లరసములు గ్రోలలేక
నీచగతి విసారములకై నెమకికొంద్రు.

మఱియు

తే. గీ. శ్రీపురాణపండకులాబ్ధి శీతకరుఁడు
సరసుఁ డాంధ్రగీర్వాణభాషావిదుండు
మల్లయార్యుండు నా మేనమామ యగుటఁ
గవిత యెటులున్న నీకృతిఁ గణుతిఁ గాంచు.

పారి—అయ్యా ! నీవు సభాసదులతోఁ జెప్పవలసిన దంతయుం జెప్పితివి గనుక నేనిక నాటకప్రయోగమున కారంభించెదను.

సూత్ర—వేషము లన్నియు సిద్ధము జేసితివా ?

పారి.—సిద్ధమయి యెంతసేపయినది? అదిగో! మనమిత్రుఁడు మహేంద్రుని వేషము వైచికొని మహావైభవముతోఁ గొలువుండుటకు ముచ్చటపడుచున్నాఁడు.

సూత్ర.—(చూచి) ఔనౌను. ఈసభాసదులతో నింకొకమాట మనవిచేసి పోవుదము. ఓసదస్యులారా!

మ. అమరాధీశునికొల్వుఁ జూచి యటుపై నయోధ్యాధ్వశీమంజువా
క్యము లాలించి సుఖించి, ద్వారకను సత్యాపద్మగంధీసమే
తు మురారాతినిఁ గాంచి, మీఁద హరి దైత్యుల్ పోరు సంగ్రామమ
ధ్యమునం దించుక నిల్చి, మీమనసు లత్యానందముం బొందుతన్.

[అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.]

ఇది ప్రస్తావన.

---

# ప్రసన్నయాదవము

## ప్రథమాంకము.



రంగము—ఇంద్రసభ.

[అప్పుడు పీఠములమీఁదఁ గూర్చుండి మహేంద్రుఁడు, బృహస్పతి, జయంతుఁడుఁ బ్రవేశించుచున్నారు.]

మహేం—(విచారముతో నిట్టూర్పు విడిచి) ఆచార్యా!

పోఁడె వడఁగెన్ హిరణ్యకశిపుండు, గతించెను దారకాసురుం
డడఁగెఁ గథావశేషుఁ డయి యాదశకంఠుఁడుఁ, మాకిఁకఁ జా భయం
బుడిగె నటంచు నీత్రిదివముద్ధృతదానవకంటకంబ యై
యొప్పుఁగద యంచు నేఁ దలఁగ నీనరకుం డెటనుండి వచ్చెనో. 1

బృహ—మహేంద్రా! ఎటనుండి వచ్చెనో యననేల? పద్మగర్భుని యవివేకమునుండియు మన మందభాగ్యమునుండియు—

ఆ. వె. మొదలఁ జేసినాఁడు పిదప దైత్యుతపంబు
మెచ్చినాఁడు వరము లిచ్చినాఁడు
వేల్పుఁబెద్ద యనుచుఁ బేరు పెద్దయె కాని
యతఁడె చేసె మనకు నధికహాని.

మహేం—పద్మగర్భుని నిందించుటకన్న మనభాగధేయమును దూరుట యుక్తము. నేఁ జేసినదోస మేమోకాని యీనాపరిపాలనము దినదినగండము వేయేండ్లాయు వన్నట్టు లున్నది. ఒకరాక్షసుఁడు గాఁడు, ఒకనాఁటి పరితాపము గాదు. మూఁడు జగంబులకు నేకచ్ఛత్రాధిపత్యంబు వహించి ముప్పదిమూఁడుకోటులదివ్యులకు నాయకుఁడ నయిన నేను క్షణక్షణము నసురభీతిచేఁ గుండెలు జేతఁబట్టుకొనియుంటఁ జూడ నాలో నాకె సిగ్గగుచున్నది. అనవరతచిత్తసంక్షోభకారణ మయిన యీసామ్రాజ్యంబు నేలుటకన్న నిరపాయంబును, నివృత్తసకలలౌకికవ్యాపారంబును, నిర్మనస్తాపమును నగుమునివృత్తిఁబూని నారాయణుచరణంబు శరణంబుగాఁ గానలనుంట సముచితం బని తోఁచుచున్నది. అమరపక్షపాతి యగు నబ్జనాభుం డెన్నెన్ని యవతారంబు లెత్తి యెందఱెందఱి దైత్యులం దునిమినను నిర్జరులభాగ్యదోషంబున వారికులంబులు తామర

తంపరలయి నానాఁట నభివృద్ధిఁ జెంది యిసుకపాతరలట్లు తఱుఁగకున్నవి. పాపనిరతంబును, గుణరహితంబును నగు నాయధమదానవానీకంబునకు వంగి వంగి జోహారు లొనర్ప లేక, యొదిఁగి యుండలేక, సపర్యలు సలుపలేక, విసిగిపోవుచుంటిని. ఈనరకాసురుండు ముచ్చుఁదనమున సోమకునికన్నఁ, గ్రౌర్యంబున దారకునికన్న, మగఁటిమి హిరణ్యకశిపునికన్నఁ, బరకాంతాసక్తి రావణునికన్న మిన్నయఁట! విశేషించి లోకభయంకరుండు మురుండును, దుష్కారారంభుండు నిశుంభుండును, గ్రూరస్వభావుండు హయగ్రీవుండును, శౌర్యధనుండు పంచజనుండును వానికిం బాసటయయి వచ్చి నాలుగుభుజంబు లట్లుపచరింతురు. ఇంతకు వారిపైకరిగిన మనబలగంబు గతి యేమియయ్యెనో తెలియదయ్యె. నేఁ డది యేమో కాని శూరజనసులభమగు నుత్సాహము నాహృదయమున నెలకొనియుండలేదు. నామనస్సు పరాజయమునే శంకించుచున్నది.

బృహ.—మహేంద్రా! వెఱవ నేటికి?

తే. గీ. మూఁడఁదలఁచిన మేల్కీళ్లు నీడ లట్లు
ధృతియు భీతియుఁ బొడసూపు హృదయమునను
సాధుజనములు వానిసూచన లెఱింగి
భావిగతుల బుద్ధిని నెంచి పని యొనర్తు.

వెఱచినమాత్రమున నాపదలుదూరమునకుఁ బోవు. ధైర్యమూనిన నవి సమీపమునకు రావు. వగచి జేయునది లేదు. కావున నుదారపురుషలక్షణ మగు ధైర్యము విడచి యుండరాదు.

జయం.—ఆచార్యా! అసురేశ్వరుని కింత వెఱఁగుపాటుఁ గలిగించు నాదైత్యుఁ డెవ్వరి కుమారుఁడు? ఏమి మహిమవాఁడు? ఈయుదంత మెఱింగింపఁబోలునేని నా కెఱింగింప వేఁడెదను.

బృహ.—వత్సా! ఎఱింగింపరాకేమి? చెప్పెద వినుము. వినియుందువుగదా తొల్లి భువనకంటకుఁ డగుహిరణ్యాక్షుఁ డనుదానవకులసార్వభౌముఁడు కలఁ డని. ఆతఁడు తన మగఁటిమి నిగ్గరుల కజేయుఁడై భూమిదేవిని సెలుగులుఁబెట్ట నాకారణమున ననవరతమా దేవపక్షపాతి యగు నారాయణుండు శ్వేతవరాహరూపమెత్తి యారక్కసుఁ బరిమార్చి భూమిదేవిని నుద్ధరించి తనకొమ్మున ధరియించి బుజ్జగించె. అప్పుడు పురుషోత్తమునకును భగవతియగు వసుంధరకును నరకుఁడు జన్మించె. పదపడి వాఁడు తన తపోవిశేషమున వారిజాసనుని మెప్పించి వరములఁ బడసి మర్త్యలోకము జయించి దివమును జట్టుముట్టి యిప్పుడు మనకు వెఱపుఁగొలుపునంతవాఁడయ్యె.

జయం—[ఆశ్చర్యముతో] ఏమి? భువనరక్షణపరాయణుఁడగు నారాయణు నకును, విశ్వహితకారిణి యగు ధారుణికిని నుదయించిన నందనుఁడో యితఁడు? ఈతఁడు నింద్యకర్మములకు వెనుదీయనిరక్కసుఁ డెట్లయ్యెను?

బృహ—కుమారా! ఆశ్చర్యమేల? చూడుము.

తే. గీ. నిఖిలజనులకుఁ జల్లనినీడ నిచ్చు
వృక్షశాఖలు రాపాడు వేళలందు
పొడము నగ్నికణము కాల్చు నడవు లెల్ల
జన్మభూమితో నేమి యసాధ్యమునకు.

మహేం—కుమారా! ఇది యట్లనె చూడుము.

తే. గీ. జలదములనుండి పిడుగులు రాలుచుండ్గ
మంచివారికి ఖలులు జనించుచుండ్రు
కంటకంబుల నుద్భవించెడు గులాబిగు
ఖలులకడుపున నుత్తము లొదవుచుండ్రు.

జయం—అయ్యా! మీరు సెలవిచ్చినదంతయు నిశ్చయము. దానవుప్రకృతివలిం బగు కాఠిన్యమునకుఁ దోడు గాంభీర్యంబునను సప్రతిహతప్రతాపంబునను నాఁడు క్రమంబునఁ దల్లిదండ్రులఁ బోలి పుట్టెఁ గావున నతఁడు నిగ్రహింపఁ దగినవాఁడని తోఁచు చున్నది; యుద్ధవార్త దెలుపుటకు సమరాంగణంబునుండి యింతవఱకు నెవ్వఁడు నొక్కఁడు రాకుండుటకుఁ గారణ మేమయి యుండును?

బృహ—అదిగో నెవ్వఁడో యిటు వచ్చుచున్నాఁడు. (పోల్చి చూచి) మన మహేం పరిజనుఁడగు మాణిభద్రుఁడు.

మహేం—ఈతఁ డేమివార్త చెప్పనోకదా! ముఖవైఖరి కీడును సూచించెను.

[అప్పుడు మాణిభద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాణి—(తనలో) కటకటా! నేను మిక్కిలి మందభాగ్యుఁడను. ఈశ్రవణ కఠోర మగువార్త మహేంద్రునకు నే నెట్లు విన్నవింతును? అయినను స్వామి యగు కుబేరుని నియోగము నడుపక తప్పదుకదా!

చ. అనుపమధర్మమార్గచరు లైనసుపర్వులు పాఱుచుండ దు
ర్జనులు కృపావిహీనులును రక్కసు లాజి జయంబు గాంచుటల్
గనుఁగొన ధర్మమే జయముగాంచెను నంటు యబద్ధమంచునుఁ
ఘనభుజసారమే విజయకారణ మంచును నేఁ దలంచెదన్.

[ప్రకాశముగా] రక్షింపుము. రక్షింపుము. త్రిలోకాధినాథా !

(అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

మహేం—(సంభ్రమముతో) ఓయీ ! ఏమి మూడినది ! దేవసైన్యపరాజయ మెఱింగింప వచ్చితివా ?

బృహ—నాకలోకము ముక్కడిరక్కసుల పాలయినదా ?

జయం—దేవకాంతల యదృష్టములు విపరీతములై యయ్యెనా ?

మాణి—[లేచి] దేవా ! మందభాగ్యుఁడనైననేను దేవరకు దేవసేనల విజయ మంగళవార్తలు దెలుప నోఁచుకొననైతిని.

మహేం—ఆదేవాసురసమరము మన కశుభపరిణామ మెట్లయ్యెనో సంగ్రహముగా మాకెఱింగింపుము. కాలోచితముగ వలయుప్రతిక్రియ యొనర్చుకొందము.

మాణి—(అంజలిపట్టి) దేవరవారు చిత్తగింతురుగాక ! ఆవిధమున ముర, నిశుంభ పంచజన, హయగ్రీవ సముధిష్ఠితంబులయి దైత్యదానవానీకంబులు లోకంబులు మ్రింగు లాగున నార్చుచుఁ దేర్చి నిల్చిన, యమ, యాదఃపాల, దహన, ధనప, పవన, పశుపతి ప్రముఖు లగుదిక్పాలకులు వేలుపుమూఁకలం గూర్చుకొని యరదంబులు, ద్విరదంబులు, బాణంబులు, తూణంబులు, హయంబులు, భటచయంబులు, నాయత్తంబు గావించుకొని మొగంబులు పన్ని యెదుర్కొనుటయు నుభయబలంబులు నోహరి సాహరిఁ బెనఁగి సమరం బొనర్చె. అప్పుడు నిర్జరసైన్యారణ్యంబుపయిఁ గారుచిచ్చువచ్చిన దైత్యనాయకుఁడు పెచ్చు పెరిఁగి,

సీ. కలుషుఁగిత్తులంబూని కౌబేరబలముఁ జెఱకుఁగిట్టల నట్లు నఱికినాఁడు
యమకాలఁ జెలరేఁగి యగ్నిదేవునిమూఁక సన్నచీమల నట్లు చమిరినాఁడు
గుదియఁ జేతనుఁబూని కదిసి వారుణసేన నాలమందల నట్లు తోలినాఁడు
శరపరంపరలేసి జముబంట్ల మేనులు చించి జల్లెడ లట్లు జేసినాఁడు
క్రొవ్వులుఁబోలు దైత్యులకోర్తులఁ జెడి
వేల్పులలమేఁకలటుపాటి విఱుగివలసె
దిక్కు తెలిసినవార లోదివిజనాథ !
దిక్కుమాలినవారలై తిరుగవలసె.

మఱియు సేనలు పోయినపోకగాఁ దిరిగి జూడక చనుటయు,

తే. గీ. సహస్రభానుని తేజంబు మంటఁ గలసె,
నాఁటివరుణదేవునిశక్తి నీటఁ గలసె,

నెచటికో వాయుబల మెల్ల నెగిరిపోయెఁ,
జిక్కి నగమయ్యె నీశానుఁ డుక్కుదక్కి.

మహేం—[విచారముతో] అన్నన్నా! ఎంతకష్టము! అవ్వల నేమయినది.

మాణి.—అనంతరము సంగ్రామప్రసిద్ధు లగుసిద్ధులును, రిపుజనదుస్సాధ్యు లగు సాధ్యులును, పరాక్రమవార్యతులగు యక్షులును, ధనుర్విద్యాధరు లగువిద్యాధరులును గరుడగంధర్వాదు లగుతక్కుంగల ఖేచరులును, నిశాచరులం దలపడిరి.

బృహ—దైవము వారికయిన దోడుపడకపోయెనుగాఁ!

మహేం—దానవులకుఁ దోడుపడియె ననుఁడు. ఆతరువాత నేమి జరిగినది?

మాణి—ఏమి జరిగినది యని యడుగ నేల? ఈయశుభము తుదముట్టఁజెప్పెద వినుండు.

తే. గీ. అసురసేన విజృంభించి యంతదఱుచు
వేల్పుజోదులు వెన్నిచ్చి విఱిగి పనిరి
యొకఁడు పోయినదెసకు నింకొకఁడుపోక
తెగినహారంబులోని ముత్తియములట్లు.

బృహ—సరే! ఇంక వినవలసిన దేమియున్నది?

ఆ. వె. జ్వలనదేవుఁ డోడె, జలధినాయకుఁడోడె,
దండపాణి యోడె, ధనదుఁ డోడె
కూల్చువాఁ డెవండు కుటిలదైత్యులఁగగ్గ
మనుభవింపవలయు నంతెగాక.

మహేం—అయ్యా! మాణిభద్ర! ఇప్పుడు నాయనుంగు నెచ్చెలు లగుదిక్పాలు లెందున్నవారు?

మాణి—దేవా! ఎందున్నవారని తెలుపుదును! కొందఱు పలాయితు లగుచుండ దానవులు వారినిఁ బట్టుకొని బంధించి శిబిరంబులనుంచిరి; కొందఱు వాహనంబుల నెక్కియు మఱికొందఱు పాదచారు లయియుఁ దల విరియఁబోసికొని వెనుక జూడక పోయెడుచో లెఱుంగక దానవులబారిఁ బడక తప్పించుకొన నూదనిఁ బాఱు చుండిరి. కొందఱు పరువిడలేక యెందేని నక్కి ముక్కియున్నవారు.

మహేం—హా సఖులారా! దిక్పాలులారా! మీకెట్టిగతి ప్రాప్తించెను! ఓయీ దండధర! ఎన్నఁడును నీడవోని నీకాలదండమునకు నేఁ డింతపాటు వచ్చెనే! నిజ

ప్రతాపప్రకంపితకాలకంఠుఁ డగుదశకంఠుని బూరికిం గొనని నీమగంటిమి తుచ్ఛుఁ డగునరకునిమ్రోల నెక్కడఁబోయెనే? ఓయివరుణా! మృత్యుపాశసంకాశంబు లగు నీపాశంబులు దనుజకులప్రదేశంబుల నిరర్థకంబు లయ్యెనే? అగ్నిదేవా! శాత్రవసేనా తూలంబులంగాల్చు నీకీలంబులు దనుజులకుఁ జంద్రకిరణజాలంబులయి తోఁచెనే? ఓయీ నైరృతా! వజ్రం వజ్రేణభిద్యతే యనునట్లు మాయాబలశోభితు లగుదానవులను దానవాంశజుఁడ వగు నీవు నిర్జింతు వని కొంత యాశతో నుంటిమి. అదియెల్ల వమ్మయ్యె. మిత్రమా! కుబేరా? నిరుపమానప్రభావసమర్థుఁ డగుభగవానుఁడు కాలకంధరుఁడు నీకు సంగడికాఁడై నిను గముమున్నను నీకీపాటులు దప్పవయ్యె.

ఆ. వె. నరకుఁ డేలికాఁడు నారాయణుఁడు తోడు
మదనవైరితోడు మన కటంచు
చింత దక్కియుండఁ జెట్ట లింతలుపుట్టె
మనకు నేఁడు గాల్చె లక్కశీల.

జయం—అయ్యా! మిక్కిలి యధైర్యము పడియెదవేల? ఆపత్సమయంబున నూహ లనుసరింపఁదగినమార్గ మనుసరింపుఁడు.

మాలి—మహేంద్రా! ఊరక యధైర్యముపడి యేమిజేయుదురు? ఇంకను నాలోచింపవలసిన దింకొక కలదు. నేను చెప్పునది సాంగముగా విని సమయానుకూలముగా నెయ్యది కర్తవ్యమో దాని నొనర్తురు గాక!

మహేం—అట్లయిన నీచెప్పవలసినదంతయుఁ జెప్పుము వినుచున్నాఁడను.

మాలి—పిమ్మట యక్షేశ్వరుఁడు కుబేరుఁడు రణరంగమునుండి తొలఁగి తన హయమునైఁ గూర్చుండి పరుగిడుచు మార్గాయాసముచేత వగర్చుచు నెంతయుఁగష్టమున నన్నుఁజేరి నీ కిట్లు సందేశ మంపె. త్రిలోకాధినాథా!

చ. నే నిటులైతి; నాజి రజనీచరవీరుఁడె గెల్చె; వాయువు, వై
శ్వానరముఖ్యులుం దొలఁగి పాఱిరి, కావఁగదయ్య నందనో
ద్యానము, నంగనాతతి, సుధాకలశంబును, పారిజాతసం
తానముఖామరద్రుమవితానమును, న్మన కామధేనువున్.

మహేం—మిత్రమా! కుబేర! ఆపత్సమయమునందును స్వామిహితమును మఱువని నీచరిత్రము శ్లాఘాపాత్రము. ఓయీ! మాణిభద్ర! అట్లయిన నిప్పుడు రాక్షసేంద్రుని యుద్యమ మేమి?

మాణి—దేవా! దురాత్ము లయినశాత్రవులు జయమొందినపుడు పరాజితు లయిన పగతుర నేమిసేయుదురో యదియే వానియుద్యమము.

బృహ—అదియేదో తేటతెల్లముగా నెఱింగింపుము.

మాణి—దానవబలంబులు దేవబలంబులను నుఱుమాడి వెన్నంటి తఱుముచుండ మేఘగంభీరభీషణంబు లగుభాషణంబులతో రాక్షసరాజు తనబలంబుల కిట్లని యానతిచ్చె.

ఆ. వె. పూలతోఁట లనక పుణ్యభూములనక
రాజనగరు లనక రచ్చ లనక
వెల్లువఁబోలు సొచ్చి వీరదానవులార!
కొంకు జంకు లేక కొల్లఁగొనరొ.

బృహ—అట్లయిన మనము మనజాగరూకతమీఁద నుండవలయును.

మహేం—ఆర్యా! ఎయ్యది యీయవసరమం దాచరణీయమో, యెయ్యది యనాచరణీయమో నే నెఱుఁగజాలకున్నవాఁడ. మనసేన యున్న తెఱఁగును, రాక్షసుల యున్నతెఱఁగును విని నామనమున సహజసన్నాహోత్సాహంబు డిందుపడినది. త్రిదివంబు విడిచిపోవుచున్న పరిజనంబులు పశువులచాట్లు తలంపునకు వచ్చి నన్నుఁగాలు కదపనీయవు. దానవు నెదుర్కొందమన్న వాని నోర్చుటరిది. కావున నిప్పుడు నేనే మార్గ మవలంబింపవలయునో మీరు నిర్ణయింపవలయును.

[తెరలో.]

ఓహో! సిద్ధ, సాధ్య, విద్యాధర, గంధర్వ, యక్ష, కిన్నర, ఖేచరులారా! త్రిలోకాధినాథుఁ డగుమహేంద్రుఁ డెందున్నవాఁడు? ప్రాగ్జ్యోతిషాధినాథుఁ డగుదానవేశ్వరుఁ డాతని దర్శనము సేయవచ్చినాఁడు. కావున నాతఁ డున్నతా వెఱింగింపుఁడు.

బృహ—(ఆలకించి) కడపటి పని చేయుటకు రాక్షసాధముఁ డిదిగో నీదెసకే వచ్చినాఁడు.

మహేం—ఆచార్య! ఆచార్య! కర్తవ్యము! కర్తవ్యము!!

జయం—అంతఃపురరక్షణ మవశ్యకర్తవ్యము.

ఆ. వె. శౌర్యశక్తి దలఁపఁ జనకయుండుట మేలు
శత్రుఘాటి దలఁపఁ జనుట మేలు
రెండు పోల్చిచూడ మొండిరక్కసునకు
సకల మిచ్చి చనుట చాల మేలు. 14

మహేం—అట్లయిన స్త్రీలగతియేమి ? తక్కుంగలవారలగతియేమి ?

సీ. కనఁబడ్డసతినెల్లఁ గవయఁజూచెడు నీచు గారవించుటె వేల్పుఁగన్నియలను ?
మాపేరు విన్నంత మండిపడెడుదాయ ముద్దు సేయుటె నాదుపుత్రకులను ?
స్వర్గమంతయుఁ బాడుసలుప నెంచెడుకూళ విడిచిపోవుటె కల్పవృక్షములను ?
మునియాగపశువుల ద్రుచ్చిలించెడుపాపి యపహరింపఁడె వేల్పుటావు నకట ?
కరుణ యెట్టిదో యెఱుఁగని కటికచేనఁటి
బ్రతుకనిచ్చునె యింక నైరావతమును ?
ముజ్జగంబులదొర కింత మూఁడు ననుచు
నించుకేనియుఁ గలనేని నెఱుఁగనైతి. 15

బృహ—నాఁ డెంతఘాతుకకర్మనయిన నొనర్చుటకు సందేహింపఁడు. కావున, నచ్చరలను, దక్కుంగల వియచ్చరాంగనలను మేరుపర్వతగుహలకుఁదోడ్కొనిపొమ్మని జయంతకుమారు నంపుట యుచితము. అమృతభాండమును గాచుగవియు వారలతోఁ బోవుఁగాక !

మహేం—అట్లయిన నింక జాగొనరించిన ప్రయోజనమేమి ? వత్సా! జయంతా!

చ. తడయకుమన్న ! దానవకదంబము సేరకమున్న వేలుపుం
బడఁతులతోడ మీజనని భద్రముగాఁ గొనిపోఁ గదన్న ! కా
రడవులకైనఁ బర్వతగుహాంతరభూములకైనఁ జెచ్చెర
న్నడువఁగఁ గొంతకాల మిటఁ గ్రమ్మఱవత్తురుగాక యందఱున్. 16

మఱియుఁ బులోముని గారాబుపట్టియుఁ జతుర్దశభువననాయకుని పట్టమహిషియు, ననూర్యంపశ్యయునగు మీయంబతో నాలుబిడ్డలసంరక్షణము సేయఁజాలనివజ్రపాణి యిట్లు చెప్పె నని పలుకుము.

చ. మనమునఁ దొంటిసంపదలమాట దలంపకు, శోక మెచ్చు; నొ
క్క నెలవునందె కష్టములు గాఁపురముండునె యెల్లయప్డు; మే
ల్దినములు వచ్చు; వెండియును దివ్యుల కోసఖి ! యాకురాలువే
ళను జిగిదూలుచెట్లు మరల న్మధుమాసమున న్జిగుర్పవే ?

జయం—దేవా! అట్లయిన మీ రానతిచ్చినట్లు జేసెద. (అనిపోవును.)

[తెరలో.]

చ. తునియలుగాఁగఁ గొండలను ద్రుంచినదోర్బలశాలి, యాయహ
ల్యను వలపించినట్టి రసికాగ్రణి స్వర్గపురైకనాథుడున్

గను లోకవేయి దాలిచి జగత్త్రయము గ్గనిపెట్టునేత, య
య్యనిమిషనాథుఁ డేడి దనుజాధిపుఁ డాతనిఁ జూడఁ గోరెడున్. 18

బృహ—అదిగో నడచుచున్న తమాలవృక్షములో, పుంజీభూతము లగుకాఱు చీఁకటులో యన రాక్షసులు మన మున్న దెసకే వచ్చుచున్నారు. ఇదియును మేలే. ఇంతలో జయంతకుమారుఁడు కాంతాసంతానమును నిరపాయముగాఁగొనిపోవచ్చును.

మహేం—ఆచార్యా? ఇపు డీతనితో నె ట్లెదుర్కొని సంభాషింతము? సామ వాక్యములతోఁ బట్టుపఱచిన సంధికి నంగీకరించునేమో ?

బృహ—ఎంత వెఱ్ఱివాఁడవు ! దురాత్ముఁడు శాంతవచనములఁ జక్కఁబడునే ?

తే. గీ. అధముఁ డగువాని సామవాక్యముల యోగ్యు
లనునయింప నాతని యల్క యినుమడించు
నెఱయఁ గ్రాగిన చమురుపై నీళ్ళు చల్లఁ
బొగయు మంటయుఁ బుస్సున నెగయునట్లు. 19

మహేం—అట్లయిన నతఁడు రాకమున్న యనుష్ఠేయము నుపదేశింపుఁడు.

బృహ—అది యీపఱకే యుపదేశింపఁబడినది. అయినను మఱియొకమాట చెప్పెద. ఆదానవుఁ డీకొలువుకూటముంజొచ్చినతోడనే నీవును నేనును మన వైరమును మనమనములనుండి దూరముగఁ దోలి యతని సబహుమానంబుగ నెదుర్కొని చింతామణీభద్రపీఠంబున నాసీనుఁ గావించి నాకభువనంబును, నందనవనంబును, గల్పభూరుహంబును గనకాంబుజములు వాని కొసంగి మనము దొలఁగుట కార్యము.

మహేం—మన మెచ్చట నుండవలసినవారము ?

బృహ—మేరుగుహలచెంతనో, మానససరోవరములపొంతనో ?

మహేం—మన కీదుఃఖమునుండి విమోచన మెప్పుడు ?

బృహ—రాక్షసుని మరణసూచన మెప్పుడో యప్పుడు.

మహేం—అది సంభవించు టెట్లు ?

బృహ—ఇట్లు ఆశ్రితావనపరాయణుఁ డగునారాయణుఁడు దుష్టదానవనిగ్రహంబునకును, శిష్టమానవానుగ్రహంబునకును యాదవవంశమున నుదయించెనని పరమేష్ఠి సనత్కుమారునకుఁ జెప్పుచుండఁ దొల్లి యొకనాఁడు నేను వింటిని. మనమా దేవకీనందను నాశ్రయించి యీవిపత్సాగరము నీఁదుదము. అతనిచేతఁగాని తదన్యునిచే నీలోకకంటకుఁడు పిల్కుమాఁగడు. మేటిరాకాసులఁ బోకార్ప నతఁడు కంకణము గట్టియున్నవాఁడు. ఆనందనందనచరణారవిందముపాలఁ బడినవారు చెడినవారు లేరు.

మ. అగదంకారము లాజవంజవతమోహారపరిభావంతము
ల్జగదానందదముల్ సురారియువతీసౌభాగ్యలుంటాకము
ల్నిగమోర్వీజశిఖాప్రనాళములు కాళీయాహినిర్బంధముల్
భగవంతుం డగు దేవకీతనయు శుంభత్పాదపంకేజముల్.

కావున నాపుండరీకాక్షునకడకు మాణిభద్రుని నుచితసందేశముతోఁ బుత్తెంచుదు. దాన మన సెంజిలి సమగ్రముగాఁ దీఱును.

మహేం—అవివేకాంధకారాతిశయమునఁ దెన్నుగానక తిరుగులాడుచున్న నా మనస్సునకు వివేకదీపికచేఁ జక్కనిదావు పొడకట్టినది. అట్లొనర్చెద. అయ్యా! మాణిభద్రా! నీవు మాకు దూతవై యసురకార్యముం దీర్పవలయు. ఇది సకలభువనహితము.

మాణి—దేవా! ఆజ్ఞాపింపుము. సేవకునకిది మహాప్రసాదము.

మహేం—అట్లయిన నో మాణిభద్రా! జగద్భద్రసంధాయకుఁడగు వసుదేవుఁడు వాసము సేయు ద్వారకానగరమునకుఁ బోయి యందుండు కమలాకరప్రభాకరుఁ డగు నా పుండరీకలోచను సందర్శించి దివౌకసులయాజ్ఞ సమగ్రముగా విన్నవించి,

సీ. కాళీయఫణిఫణాగ్రములఁ దాండవమాడు నడుగుదమ్ములకు జోహారులనుము
అదితికశ్యపులకు నవతరించిననాఁడు మాకొసఁగిన మాటలు మఱవకనుము
అసురసంతతియిట్లు లంబాట్లు పఱచుచుండ నోపనికైనఁ జూచుటొప్పదనుము
ఈ తెఱంగునఁ జేయ లాతివారమె మేము చాలకాలమునాఁటి సఖులమనుము

ఆలుబిడ్డల దెసఁ జూచి యసురరిపుఁడు
వేయుగన్నుల బాష్పము ల్విడిచెననుము
అసురఁ గడతేర్చుమని తన కలఁతి యనుము
దైవహిత మాట నియ్యది తప్పదనుము.

మాణి—దేవా! అట్లంతయు విన్నవించెదను.

బృహ—దానవుఁడు వచ్చువఱకు నీ విటనుండి యతనిపల్కులువిని చెయిదములఁగని యవ్వల నరుగుము. అప్పుడు నిర్జరులయవస్థ యాదవేంద్రునకు సమగ్రముగ నెఱిఁగింప నవకాశ ముండును.

మాణి—హా! కష్టము. కష్టము. దానవసైన్యంబులు సవిధభూములకు రానే వచ్చినవి.

బృహ—మహేంద్రా!

చ. మనమున నించుకేని యనుమానము నొందక దానవేశ్వరు
న్గని వినయంబుతో నెదురుగా జని గద్దియ జేర్చు; లావు మా
యునపుడు నల్పుఁడై యొదిగియుండుట న్యూనత గాదు; గ్రీష్మమం
దున బలుతిప్పలుంబడునదుల్ గాలుకాఁగనఁ బూర్తిఁ జెందవే?

మఱియు నోసునాశీర!

తే. గీ. అధిక తేజస్సునకు నైన నప్పుడప్పు
డుచ్ఛనీచంబులుగ్గ్రహమందుఁ జూవె
జగము వెలయింపఁగల సూర్యచంద్రులకును
గ్రహణముదయాస్తమయములు గలుగునట్లు.

మహేం—దేవగురువుయుపదేశముల శిరసావహించినాఁడ.

[నరకాసురుఁడు, పంచజనుఁడు, వజ్రకంఠుఁడు ప్రవేశించుచున్నారు.]

నర—ఓయీ పంచజనుఁడా! బాహుబలంబున, బుద్ధివైభవమున మనకన్న నల్పుఁడగు మహేంద్రుని సింహాసనభ్రష్టునిఁ గావించి నాకలోకమునుండి సాగఁద్రోలక మన వంశకర్తలగు నాదిరాక్షసు లూరకయుండుటకుఁ గారణ మేమి?

పంచ—దేవా! ఆమహాత్ములూరకుండలేదు. దివిజసౌధాగ్రక్రీడాంగంబు లయిన మనపూర్వులు త్రిలోకవిజయంబు గాంచినపుడు కుటిలుండగు విష్ణుదేవుఁడో మతిలేని శంకరుఁడో యేదోరూపములెత్తి వారలఁ గడతేర్చుచుండువారు. ఆకారణంబున నీతని కింతవిభవము జరుగుచున్నది. ఈపర్యాయము మీరున్నట్లు నిరాటంకముగా జరుగఁగలదు.

నర—(నవ్వుచు) మన దానవవీరులు నిజముగా నాదామోదరునిచేత సయితము నిహతులయిరా? అట్లయిన వారిపరాక్రమ మెట్టిదో చూడవలసినదే?

వజ్ర—మహాప్రభూ! వారు వట్టిపిటికివారు. మీ ముందర వారు దిగదుడుపు నకైనను బనికిరారు.

బృహ—మహేంద్రా! అదిగో దానవుఁడు. వాని నెదుర్కొందము రమ్ము.

మహేం—దానవేంద్రా! నీకు స్వాగతము.

బృహ—దానవేశ్వరా! విజయ మగుఁగాక!

పంచ—నీవన్నను అనకున్నను విజయము మాకే యయ్యెడిది.

నర—(ఆశ్చర్యము నటించుచు నింద్రునితో) ఎవరు వీరు! నముచివృత్రనిర్వాపణధూర్వహులు, పాపప్రతాపగంధసింధురపంచాననులు, బలప్రాణానిలకాలభుజంగులు నగునహల్యాభుజంగులా? మహేంద్రా!

మ. అపరాధంబులు గల్గె మావలన చండారాతి సైన్యాటవీ
కపనోద్యద్దహనాయమానపటుదోర్దర్పప్రతాపాఢ్య ని
న్నిపుడీరీతినిఁ జూడవచ్చితిని నే నిన్నాళ్లు రాకుంటకు
న్నృపతోడన్ క్షమియింపు తమ్ముఁడఁ గదా యెంతైన దేవేశ్వరా! 24

అయ్యో! మఱచితిని. నేను మీకుఁ దమ్ముఁడ ననుట మిమ్ము రెండవమా ఱవమానించుట గదా!

వ్రజ—అజాగళస్తనములవలె నిరర్థక మయినవజ్రాయుధము ధరించి యీపరాక్రమహీనుని తమ్ముఁ డనిపించుకొన్న మీకవమానము మహాప్రభూ!

పంచ—ఓమహేంద్రా! ఓదేవగురూ! నేను పంచజనుఁడను, నరకమహారాజు బంటును.

బృహ—మేము మిమ్మెఱుంగకపోలేదు.

మహేం—దానవేశ్వరా! ఉల్లసపుబలుకులతో నేమిప్రయోజనము? శత్రురాజులపై దండు వెడలుట క్షత్రియధర్మమగుటచే నీవిటు చేసితివి ఇందు క్షమింపవలసిన దేమున్నది? జయము నొందితివని యెఱుంగుదును.

మాణి—(తనలో) ఈసమయమున నే నిచ్చట నుండరాదు. చాటుననుండి వీరి పలుకులఁ గనిపెట్టెద. (అని పోవును.)

నర—పురందరా! నామాటకు నీవింత యుడికెద వేల? అట్లయిన నుల్లసపుం బలుకులతో నేమి? నావచ్చినపని చెప్పెదవినుము.

తే. గీ. ఎల్లభువనంబులకు నీవ యేలికవఁట
బలము కలవాఁడవఁట మానవంతుఁడ వఁట
కొండఱెక్కల నొక్కింటిఁ గూల్చితివఁట
యేది మాత్రము రమ్మందు యించుకంత.

బృహ—(తనలో) మాయసహాయత్వము నెఱిఁగి వీఁడు మమ్ము మాటిమాటికి రణమునకుం బిల్చుచున్నవాఁడు.

మహేం—దనుజేశ్వరా! రణమునకేమి? అదియొకభాగ్యముకాదు, చూడుము.

చ. కనుఁగొన దేవదానవులు కశ్యపుసంతతి వారెకావున
న్దనుజవరేణ్య! యన్నలకుఁ దమ్ములకుం బగ చెల్లునయ్య? లోఁ

గినియక మీరు మేమెపుడు క్షీరమునీరములట్టులుండిన
స్మరలను దేత్రిమాడఁ దగమా యొకమాత్రపువాని కాజిలోక్.

నర—ఆహాహా! ఎంతకాలమునకు నేను మీకుఁ జుట్టమనయితిని?

పంచ—సోదరప్రేమ మహేంద్రుని శరీరమునుండి వెల్లివిరిసి పొఱలుచున్నది!

వజ్ర—పిల్లుల కెలుకలును, దోడేళ్ళకు మేకలును నెంత దగ్గఱచుట్టములో మాకు మీరును నంతదగ్గరచుట్టములే.

బృహ—ఓ దానవసార్వభౌమా! ఈమహేంద్రుఁడు వచియించినట్లు మనయు భయకులములు పొందుపొసఁగియుంట యుచితము. మీరు రాక రాక వచ్చినయతిథు లగుటచే మా కాదరణీయులరు. అందుచేఁ గూరుచుండి ప్రసంగింతము. నీవామహేంద్రపీఠము నధిష్ఠింపుము.

మహేం—దానవేంద్రా! అట్లుచేయుదును. మాకు మీరతిథులుగదా!

నర—ఓ హో హో!

ఉ. ఎన్నఁడులేనికూర్మి యిది యెచ్చటినుండి జనించెనయ్య? నీ
కి న్నరకుండు దేవవిభుఁ డెక్కుడుపీఠము నెక్కువాఁడె? మీ
రన్నను నే నోర్వఁగలనా యది, యొయ్యది యెక్కువాఁడు తాఁ
గన్నులు వేయి దాల్పవలె గౌతమునింటను కోడి గావలెన్.

వజ్ర—వినుము, వినుము. అంతశుభిమకలవాఁడే దాని నధిష్ఠింపవలెను. పాప మీమహేంద్రుఁడు కష్టపడి రేయి యనక పగలనక కోడియో కుక్కయో యయి వేయికన్నులు దెచ్చుకొన్నాఁడు. అంతపాటిశక్తి యెవరికున్నది?

బృహ—(తనలో) రాక్షసుల యొత్తిపొడుపుమాటలు భరింపశక్యముగాకున్నవి.

మహేం—(తనలో) ఇంతకన్న శూలములతోఁ బొడిచిన మేలు. కటకటా! కాల మెంతలో మాఱినది?

బృహ—దానవనాయకా! ఎన్నఁడో పోరుపాటున నోసర్చినలోపముల నెంచి యింతవానిని నిరాధిక్షేపించుట మీవంటి వీరపురుషుల కుచితముగాదు.

నర—అట్లయిన మీరు హితమగుపనియే యొనర్చెదను? చిత్తగింపుఁడు. ఓయీ! మహేంద్రా! భూధరపక్షచ్ఛేదనశౌండ!

వ. ధరణీరాజ్యము వీరభోజ్య మని పెద్ద లెప్పఁగా వినుదు ని
ర్జరలోకేశ్వర! రెండపల్కుల కిటు స్వర్గిత్వ త్తరం బిమ్ము నీ

కరమందుం గులిశాయుధంబుఁగొని సంగ్రామంబు గావింతువా!
సురసామ్రాజ్యపదంబు నాకుఁ గరము ల్జోడించి యర్పింతువా?

పంచ—మహారాజా!

తే. గీ. కాలుదండంబు, ధనదుని కఱకుఁగత్తి,
వరుణపాశంబు, మనమీఁద వమ్ములయ్యె!
వజ్ర మేటికి ధరియింపవలయు వీఁడు?
కొండలనుఱెక్కల్ మఱచిచెక్కుటకె గాక.

వజ్ర—దేవా! మిమ్ముఁ జూచినతోడనే యెన్నఁడో చచ్చినట్లు నిశ్చేష్టులగు నీదేవరాజబృహస్పతులు యుద్ధము సేయుదురా? బలహీనులమీఁద నెదురున్నచో నీయంతటివారు మఱియుండరు.

నర—మహేంద్రా? ఊరక నుండెదవేల? ప్రత్యుత్తర మిమ్ము.

పంచ—హరియో హాయఁగో తమకుఁ దోడ్పడువఱకు నిరుత్తరులయియుందురు కాఁబోలు?

వజ్ర—హరియా వచ్చుట? అతఁడు తనరక్షణముఁ జేసికొన్నఁజాలు, వీరిని రక్షించినంతఫలము.

నర—అన్నట్లుమఱచితిని. ఓ దేవరాజా!

మ. హరి మీపాలిటి దైవతం బనుచు దైత్యధ్వంసి యంచు న్నుతిం
తురుగా మీరలు సర్వకాలమును జేతుల్మోడ్చి; వాఁడేఁడి? య
క్కఱకు న్నాఁడదియేమి? వచ్చి మిగులన్గారుణ్య మేపార ని
ర్జరుల న్బ్రోవఁడదేమి? పిమ్మటసమాశ్వాసింపఁ దావచ్చునే?

మహేం—(తనలో) హరినీవిధముగా నిందించు వీని కేమిగతికలదోకదా!

బృహ—(తనలో) ఇట్టివైపరీత్యములు కాలమాసన్నమైనవానియందుఁగన్పట్టును.

వజ్ర—గురుశిష్యులిద్దరు బెల్లము [redacted]కొట్టినరాళ్ళవలె నూరకుండెదరేల? మహారాజున కేదోయుక్తప్రత్యుత్తర మిండు.

మహేం—ఆచార్యోత్తమా! ప్రత్యుత్తర మొసంగుఁడు.

బృహ—దానవేంద్రా! వేయుమాట లేల? ప్రతాపానలపరిశోషితదిక్పాలకసేనాపముద్రులును దృణీకృతనారాయణులును నగు మీతో సమర మొనర్ప మహేంద్రుఁడెంతవాఁడు? అతఁడు సంధి యుచితమని యూహించుచున్నాఁడు.

పంచ—దేవదానవులవైరము సంధి జేసికొనుటకుఁ బాకము తప్పినది:

వజ్ర—ఇంద్రున కిప్పుడు భయజ్వరముచే నొకపెద్దసంధిరోగము ప్రవేశించినది.

నర—మహేంద్రా! అట్లయిన నానిశ్చయము విస్పష్టముగఁ జెప్పెద వినుము.

చ. పలుకులు వింటి నప్సరలపాటలు, జేర్చితి నీవు పేను ని
ర్మలనవ్యమృదుపారిజాతకుసుమంబుల సెజ్జలమీద, నాకభూ
ములు చిరకాల మేలితివి, పూర్తిగఁ జెల్లెను వంతు మీకు దై
త్యుల కికఁ వంతు చెల్లఁదగు దూరకను పొందు తొలంగి వేలుపుల్.

దేవత లెంతకాలము స్వర్గము పరిపాలించి రంతకాలము దానవులును పరిపాలించిగాని తొలఁగరు. మఱియు స్వర్గమునుండి యొక్క పూరిపుల్ల యయినఁ గొనక యెందయిన జని బ్రతుకుఁడు. దీనికి విరుద్ధముగాఁ బ్రవర్తింతు రేని యీనరకుండు నేల్పులపై జాలి నొందువాఁడు కాఁడని మీరు యెఱుఁగుదురు.

సంచ—దేవా! మీరు లెస్సగా సెలవిచ్చితిరి.

వజ—ఈసాడు బేసగాలు నేఁటికాలముకు మాయను మరుగిలి పోవుచున్నారు.

మహేం—(విచారముతోఁ దనలో) రాజ్యలక్ష్మి! నీవు చంచల వనుమాట నేఁడు నిశ్చయ మయినది.

బృహ—(తనలో) అనుకొన్నదాని కేమియుఁ గొరత కలుగలేదు.

మాణి—(తనలో) కటకటా! త్రిలోకాధీశ్వరున కెంత కష్టమువచ్చినది. ఇఁక నే నిచట నిలుఁగఁజాలను. నాపనిమీఁద బోయెదను.

(అని నిష్క్రమించును.)

నర—ఓయింద్రబృహస్పతులాలా! మీయునికి నాకోపానలంబునకుఁ బ్రజ్వలన హేతువు. గావున మీరిటునుండి సత్వరముగ బొండు.

వజ—చుట్టుపట్ల పొలిమేరలలోనైన మీరు కనఁబడుదురేని మీగుండెలలో నిద్రవోయెదను. జాగ్రత.

బృహ—మహేంద్రా! ఏల యాలస్యము? పోవుదము రమ్ము.

మహే—(తనలో)

సీ. చిరకాలమునుండి సుఖకాణాచియౌ విబుధలోకంబును విడుచు టెట్లు
చింతామణీభద్రసింహాసనంబున్న యమరావతినిఁ బాసి యరుగు టెట్లు?
మధువైరిచరణాబ్జ మకరందరసమైన మందాకినీనది మఱచు టెట్లు?
సిరికిఁ దోబుట్టువై క్షీరాబ్ధినుదయించు పారిజాతముఁ బాసి బ్రతుకు టెట్లు?
దినము నైరావతము నెక్కి తిరుగకుండ
కాలినడకను నట్టిట్టు కదలు టెట్లు?

నందనోద్యానవీథుల నడుమనుండ
నిముసమైన నేఁ జెఱచోట నిలుచుటెట్లు ?

(మహేంద్రబృహస్పతులు నిష్క్రమించుచున్నారు.)

వజ్ర—ఇప్పటికి నాకమునకు దరిద్రదశయంతయు దొలఁగి శోభ కలుగు కాలము వచ్చినది. దేవా! మీరు చింతామణీభద్రసింహాసన మధిష్ఠించి దేదీప్యమాన ప్రభలతోఁ గొలువుదీర్చి మాకన్నులకు విందు సేయవలయును.

పంచ—దేవా! ఇప్పు డీపీఠము నెక్కవలదు. భగవంతుండును దానవకుల క్షేమంకరుండును నగుశుక్రాచార్యుని యనుమతంబున బుణ్యదినంబున సుముహూర్తంబున మీరు సురసామ్రాజ్యపట్టాభిషిక్తులగుట యుచితము.

నర—ఇది యవశ్య మాచరణీయము. ఇంతలో నాకలోకవైచిత్ర్యములఁ గనుఁ గొందము. పట్టాభిషేకముకన్న ముందు మహేంద్రుని యుంపుడుకత్తె యగు నూర్వశిని సందర్శించుటకై నామనంబు తత్తరపడుచున్నది. దానిచక్కదనము వర్ణనాతీతమని మున్ను నారదాదిమునులవలన వినుచుందును. కావున సత్వరము పోవుదము రండు.

పంచ—చిత్తము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ప్రథమాంకము సంపూర్ణము.



# ప్రసన్నయాదవము

## ద్వితీయాంకము.



[మందపాలుఁడను రాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మందపాలుఁడు—(తనలో) ఛీ! ఛీ! ఈపాడుస్వర్గమున కేలవచ్చితిని? ఈ యమరావతీపట్టణమును జూచినది మొదలు నాకు 'పేరుగొప్ప యూరుదిబ్బ' యనుసామెత జ్ఞప్తికి వచ్చుచున్నది. ఈనగరము సకలవస్తుసంపన్నమనియు, సకలసంపదలకు స్థానమనియు, మహావైభవసమేతమనియు పలుమారులు మహాత్ములు వేనోళ్ళఁ బొగడుచుండ విని కాఁబోలు ననుకొని నావనోరథము లన్నియు సఫలంబు లగు నని పుట్టెడాశతో వచ్చి తుదకు మోసపోతిని. మనులు ముండకొడుకులు. స్వర్గముపైఁ గలదురభిమానముచే దీని నంతగా వర్ణింతురే కాని దీనియం దేమిగొప్ప యున్నది.? ఈమందాకినీనది యొక సముద్రమంత యున్నది. కాని యిందు నాకుఁ గావలసిన చేపలు, జెల్లలు, నత్తలు, పీతలు, రొయ్యలు లేనేలేవు. నోటికిరుచిగా వండించుకొని తిందమన్న నింతతూఁటికూరైన గాని యిక్కడ లభింపదు గదా! ఈనదికన్న మాయూరచెరువే నయము. ఈనదిలో బంగారపుఁదామరపువ్వు లున్న వంట అవి యెందుకు? దేవతలు తలలు పగులఁగొట్టుకొనుటకుఁ బనికివచ్చును. మూఁడుదినములనుండి నాకు ముంజెకాయలపై ధ్యానము పోయినది. దారిద్ర్యదేవతకు నిలయమైన యీవేల్పువీటియందు తాటిచెట్టే లేదుగదా? అన్నమతిని నీళ్లుత్రాగి యెఱుఁగని యీనిర్భాగ్యులగు దేవతలకు తాటిపండు తినునంతటి భాగ్యముకూడ లభించునా? ఈపట్టణస్థితిఁ జూడ నిందు వసించు వేల్పులు నాగరికత యెట్టిదో యెఱుఁగని, మోటపసరము లని నాకుఁ దోఁచుచున్నది. పోనీ. ఆవస్తువులు దొరకకపోయిన మానె నామనసున నున్న తక్కినగోరికలైన నెఱవేఱినవా? దేవేంద్రునిపై గత్తికట్టి దండయాత్రకు వెడలు రాక్షసులందరుఁ గావలసినంత యమృతము ద్రావి చిరకాలజీవులు గావచ్చు ననియు స్వర్గలోకమునం దప్సరసలు వేనవేలుందురు గనుక నెవనికిఁ గావలసినదానిని వాఁడు శ్రమమునఁ జేయిబట్టుకొని తీసికొని

హంసలాగు తళతళలాడుచు మెలమెలలాడుచు జలజలలాడుచు చకచకలాడుచు పక పకలాడుచు నచ్చనుగ బోగముదానివలె నుండును. వేయేల ? అప్పుడు దానిం జూచిన మహామునుల కయిన మనసు కరుఁగక మానదు. నీకది యెక్కడఁ గనఁబడినది ?

వజ్ర—నిన్న రాత్రి కలలోఁ కనఁబడినది.

మంద—(కోపముతో) నన్నె గతాళి చేయుదువా ? నీపొట్టపొడిచివెయ్య. నీకెప్పుడు నిటువంటిబుద్ధులే. నీనోరు మాటలాడుచున్న నీనొసలు వెక్కిరించుచుండును. మొదటనుండియు నొక్కమచ్చునసే బ్రతికినావు నీబ్రతుకు బండలుగాను. నేనా నీకు హాస్యమునకు దొరకినవాఁడను ?

వజ్ర—తాతా ! కోపగింపకు. ఈకుతలుపీకిన తాటిటెంకవలె తల గలిగి మీస ములు గడ్డము నరసి ముసలిపుంజు. కనుక నీకు రంభ గావలసివచ్చెనని దాయనియొగ తాళిచేసితిని. కాని నీవిప్పుడు రంభవిషయమయి చేసినసన్నాహము మెచ్చఁదగియున్నది. నీవు నిజముగఁ గోరినపక్షమున రంభను గలిసికొను నుపాయముఁ జెప్పెదవినుము.

మంద—నాతండ్రీ ! నానాయనా ! చెప్పు చెప్పు ! ఈయుపకారమునకు నేనిం కొక జన్మమున నీయింటఁ గుక్కనై పుట్టి నీఋణముం దీర్చికొనియెదను. నాకుఁ గొడుకు పుట్టినపక్షమున నీపేరు పెట్టుకొనియెదను.

వజ్ర—ఇదిగోఁ జెప్పెద వినుము. రంభ మొదలగునప్సరసలు మనము స్వర్గ మునకు వచ్చినతోడనే పాఱిపోయిరి. అయినను భయము లేదు. యుద్ధములో గడతేఱినవా రందఱు రంభాసంభోగము గాంతురు. అందుచే నీ వొకకత్తితో బొడిపించుకొని చచ్చిపొమ్ము. అప్పుడు నీకు రంభపొత్తు గలుగును.

మంద—అదిగో ! మరల హాస్యము నారంభించినాఁడవు; నేనదేవద్దన్నది. నాకుఁ గోపము వచ్చినయెడల నేను మంచివాఁడను కాను. కాఁబట్టి యామాటను మాని నేనడిగినదాని కుత్తరము చెప్పుము. రంభ పాఱిపోయినది సరే. ఊర్వశి మన కేమయిన కొంచె ముపకారము సేయునా ?

వజ్ర—ఔరా ! పిడుగా ! నీకడుపులో నెంతయూహ లున్నవిరా ! మహారా జుగారు మోహించిన యూర్వశియే నీకుఁ గావలయును గా ! సరే ! జాగ్రత్తగా నుండు. ఈమాట మహారాజుగారితోఁ జెప్పి, నీడొక్క చీలించి, ప్రేవులు తోడించి, గ్రుడ్లు పీకించి, వెన్ను చీలించి, చెంపలు పగులగొట్టించి, బుగ్గలు సాగఁదీయించి, పిఱ్ఱలో శ్లేగరఁగొట్టించి, మోకాళ్ళచిప్పలు తీయించి, నాలుక కోయించి, తల గొఱిగించి, గాడిదమీఁద నెక్కించిఁ యూరేగించి కొఱఁతను వేయింపకపోయిన నాపేరు, వజ్ర

కంఠుఁడు గాఁడు. మహారాజుగారి యంతర మేమి నీయంతర మేమి? తారతమ్య మెఱుఁగక మాటలాడెదవా ?

మంద—(వజ్రకంఠుని కాళ్లపైఁబడి) నాతండ్రీ! నన్ను రక్షింపుము. బుద్ధి నేరక నోటివట్టుపురూఁతలు కూసితిని. మఱియొకసారి నేనిట్లు ప్రేలుదు నేని నన్ను నీచిత్తమువచ్చినశిక్ష చేయింపుము. కావలసినవాఁడవు గదా యని నీవద్ద నిట్లంటిని గాని యది తప్పైనచో మరల నందునా ?

వజ్ర—సరే! నిన్ను రక్షించితిని. ఇఁకముం దిట్టిమాట లెన్నఁడు ననకుము. ఇఁక నేఁ బోవలయును. నన్ను విడువుము.

మంద—(లేచి) నీదయచేత నిప్పటికి గండము గడచి బ్రతికి బయటఁబడితిని. నీవిప్పు డెక్కడికిఁ బోయెదవు ?

వజ్ర—నరకమహారాజుగా రూర్వశీవిరహతాపమున కోర్వక యీరాత్రి వెన్నెలలోఁ బువ్వులపాన్పుపైఁ బవ్వళింతురు. ఊరడించుటకు ప్రియభృత్యుఁడనయిన నేనాయనప్రక్క నుండవలయును. ఎన్ని వర్తమానములు నంపిన నూర్వశి మహారాజువద్దకు రాలేదు. అందుచే నామెను గొనితెచ్చుటకు సేనాపతియైన నిశుంభుని మహారాజుగారు పంచినారు. ఎల్లయుఁ జంద్రోదయమగునప్పటికి నేనక్కడ నుండవలయును.

మంద—అదిగో విబూదిపండో ముగ్గుబుట్టయో తగరపుపళ్లెమో యన్నట్లు చంద్రమండల ముదయించుచున్నది. నీవింక సత్వరముగఁ బో. నామాట నచ్చట బైట పెట్టకుసుమీ! రంభ నీకెట్లుపడినదిప్పుడు నాతోఁ గొంచెము చెప్పు.

వజ్ర—వేయేండ్లు తలక్రిందుగఁ దపస్సుచేసిన రంభకు నీవంటి రసికుఁడు దొరకఁడు. ఆమెను నీవే వెదకికొనుము. నే వెతకఁజాలను.

(అని యిద్దరు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

---

[అప్పుడు దేవేంద్రమందిరము ముందఱ నొకచంద్రకాంతవేదికమీఁదఁ బువ్వులపాన్పుపైఁగూర్చుండి నరకాసురుఁడు వజ్రకంఠునితోఁ గూడి ప్రవేశించుచున్నాఁడు.]

నర—ఓరీ! వజ్రకంఠా!

చ. అదిమితి నష్టదిక్పతుల నాహవభూమి నడంచి సంతసం
బొదవ దొలకింప; రాజ్యరమ నూనితి నంచు మనంబునందు స
న్మదము ముదయింప నించుకయు, మక్కువమై నొకసారి యూర్వశీ
పదయుగము స్పృశింపఁగలభాగ్యము నాకు లభింప కుండుటన్.

వజ్ర—దేవా! ఆకోరికయు మీ కచిరకాలంబునఁ దీఱఁగలదు, ఊర్వశిందోడి తెమ్మని మీరు మననిశుంభుని బంపియున్నారుగదా! అతఁ డామె నీపాటికి వెంట బెట్టుకొని వచ్చుచుండు నని నేనూహించెద.

నర—ఆహాహా! నా కంతభాగ్యము లభించునే? ఒకవేళ లభింపఁ దలఁచు కొన్నను దుస్సహ మయిన యీవిరహతాపము నన్నంతవఱకు బ్రతుకనిచ్చునని నాకుఁ దోఁచదు. ఈమదనునకుఁ దోడగుట కదిగో శీతమయూఖుఁ డుదయించినాడు.

తే. గీ. కలసి వేల్పులు భుజియించుకంచ మనఁగఁ
జంద్రబింబము వెలుఁగొందుఁ జదల నదిగో!
సురలు తినువేళఁ గంచముచుట్టుఁబడిన
మెతుకులట్టులు చుక్కలు మెఱయుచుండు.

వజ్ర—మహాప్రభూ! మీరు సరిగా వర్ణించినారు. ఆకంచములోఁ బెట్టిన ప్రాఁతయుసిరికపచ్చడిముద్దవలెఁ జంద్రునిలో మచ్చ కనఁబడుచున్నది.

నర—ఓచెలికాఁడా!

తే. గీ. విరహతాపాతిశయమున వెచ్చ నూర్చి
పికలచిత్తులై యున్న కాముకులఁ బట్టి
సూటి బొడిచెడు వజ్రంపుటీఁటె లనఁగఁ
జంద్రకిరణము ల్వ్యాపించె జగతియందు.

మఱియు,

శా. నీరేజప్రభవాండ మంతయును నిండె న్వెన్నెల, త్రొప్పయౌ
పారావారతరంగమాలల కనుప్రాసంబులై, దివ్యత
న్వీరంగన్నవమందహాసములకున్ నెయ్యంబులై, సాఁక
ర్పూరక్షోదపరాగపుంజములకు న్బోరానివియ్యంబులై.

వజ్ర—ఈవెన్నెలకతమున బ్రహ్మాండ మంతయు సున్నపుగిడసువలెఁ దెల్లనయి యున్నది.

నర—ఈచందమామ సెకాఁకలకు, నాపుష్పిలుకానిధాకలకు నాశరీర మింక నిలుచుట యరిది. ఈశశాంకునివి శాతశరములుగాని శీతకరములు కావు. సుధాంశుఁ డని పేరొంది నిప్పులం జెఱగుచున్న యితఁడు పయోముఖవిషకుంభము సుమీ! అందుచేతనే

తే. గీ. వనజనాభునికైన నవ్వజ్రికైన
నగ్నిదేవునికైన నయ్యమునికైన

వెఱచి యెలుఁగని నే నిప్డు వెఱవ వలసె
నిండు నెలకును పండు వెన్నెలకు నకట !

వజ్ర—కామలరోగము గలవానికి జగమంతయుఁ బచ్చఁగఁ దోఁచునట్లు మదన తాపముగల మీరు జల్లని వెన్నెల పీడాకరముగఁ దోఁచుచున్నది కాఁబోలు! పన్నీట దిగిన దున్నపోతువలెనే నీ వెన్నెలలో హాయిగ నున్నాఁడను.

నర—ఓరీ ! నీకు బలె నాకీ జాబిల్లి సుఖప్రదముగ లేదు. నేను త్రిదివముపై దండువిడిసి మహేంద్రాదిదిక్పాలురల రణరంగమున నోడిచిపుచ్చి నాకమునుండి యమరులఁ బాఱఁదోలితినని మనసుఁ గ్రోధము నిలిపి యమరపక్షపాతు లగుమన్మథహాతకుఁడు మొదలగువారు హాళాహళి మెఱయ నన్నేఁచుచున్నవారు. చూడు—

సీ. మంద్రవీజనములు మాటిమాటికి వీచి కసిగుసంగఁగఁ జొచ్చె గాలివేల్పు
చలివెలుంగుల పేరి పలుబల్లెములఁ గుమ్మి సంహరింపఁగఁ జొచ్చె చందమామ
కలువరేకుల పేరి కఱకుఁగత్తులఁ జీల్చి పగఁ దీర్చుకొనఁ జొచ్చె బంచశరుఁడు
వనలతాంతములతో నందనమ్ము మనునింపి యలయింపఁ జొచ్చె నాసునివార
అక్కటక్కట! వీరియం దొక్కఁడొకఁడె
జగము లొక్కొక్కకడకుఁ దేఁజాలు నసఁగ
దుర్మదమున నీదుష్ట చతుష్టయంబు
చేర నొక్కతావున కింకఁ జెప్పనేల ?

వజ్ర—(తనలో) ఈయన యిప్పు డూర్వశిపైఁ గలమోహముచే సమస్తమును మఱచియున్నాఁడు. వీనిమనసును మఱియొకవిషయము మీఁదికి మరలెదను [ప్రకాశముగా] దేవా! స్వర్గలోకము జయించియు మీరు విజయఫలము ననుభవింపకున్నారు. ఒక్కసారి యప్సరలయాటలం జూచి, గంధర్వుల పాటలు విని, మందారపుష్పదామముల మెడఁ దాల్చి, నందనోద్యానమున విహరించి, మేరుగిరికూటముల నెక్కి, సురదీర్ఘికల జలక్రీడ గావించి, సుఖించి, యమరావతిని గొల్లలాడి, మాకన్నులకు విందొనరింతురుగాక యని ప్రార్థించుచున్నాఁడను. అమృతకలశము కామధేనువు చింతామణీరత్నము మనపాలఁబడునేమో యను నీసున నింద్రహతకుఁడు వానిని మనము రాకమున్నె తరలించికొనిపోయె. ఉన్నవైనను మనసార ననుభవింపవలదే ?

నర—వజ్రకంఠా!

తే. గీ. నందనోద్యానవన మేల? నాక మేల ?
కామగవి యేల? మణి యేల? కల్ప మేల?

యప్సరసలేల? యింక నాకమృతమేల?
చెలియ యూర్వశి నను గృపసేయకున్న.

మఱియు నామనోనిశ్చయ మొక్కసారి వినుము.

సీ. ఈవెన్నెలల వేల్పువెలనాగతోడి సయ్యాటలే కాని యేయాట లొల్ల
నొప్పులకుప్పయై యూర్వశీరమణి సంగాతమే కాని సంగీత మొల్ల
వగ లెల్ల మఱపించు సొగసులాడిపిసాళినవ్వులే కాని యేపువ్వు లొల్ల
నతనుతాపకుడంచు నాకాంత యేకాంతసేవలే కానియేసేవ లొల్ల
సమరగణికాతిలకము కూటములె కాని
కనకగిరికూటముల నొల్ల గడియయైనఁ
గోమలాంగి సిగ్గులు కొల్లఁగొనుటె కాని
యమరగణనరంబు నేఁ గొల్ల లాడనొల్ల.

వజ్ర—ఔరే! మీనిశ్చయము తెలిసినది. మీ రీవేల్పుభోగముతో తృప్తిఁగాంతు పొత్తుననగి ప్రపంచమే మఱచియుందురు. ఈపీలు చూచి దురాత్ము లగునిర్జరులు మరల విజృంభింతురు. అంతట నెండిపోయినచెఱువులోఁ జేఁపలవలె బయలుపడి మేము నశింతుము. ఊర్వశికన్న మిన్నలగు వెలయాండ్రు భూలోకంబున నెందఱు లేరు? దీనికయి యింత దురపిల్లనేల?

నర—ఓసీ! నాకవేశ్యలకుఁ భూలోకవేశ్యలకుఁ గలతారతమ్య మెఱుంగని యాసిపడఁదవుటచే నీవిత్తెఱఁగునఁ బ్రేలఁజొచ్చితివి. ఆభేదము జెప్పెద వినుము.

వజ్ర—వద్దువద్దు చెప్పనక్కఱలేదు. నేనాభేద మిదివఱకే యెఱుఁగుదును. భూలోకవేశ్యకాంతలవలె స్వర్గవారకాంతలకు విటులయెముకలు కటకట కొఱికి వేధించుకొని తినుతల్లియుండ దుండదు. నెత్తురుగ పీల్చుజలగలట్లు మర్త్యవారాంగనలు విటులిధన మెల్ల హరించి యిల్లు గుల్లజేసి తఱిమి మెత్తింతురు. సురవేశ్యలకు సొమ్ముకక్కఱలేదు. కాని మనుజలోకమునందలి పుణ్యాంగనలకుఁ జావుండుటచే నెప్పటికయిన విడుపడ యయిపోవుదురు. ఈస్వర్గలోకపు బోనిసనూంతులకు జావు లేదు. పాపీ చిరాయువన్నట్లు బ్రతుకుదురు. ఇదియే నే నెఱిఁగినభేదము.

నర—ఓసీ! నే నడిగినభేదము సౌందర్యవిషయమున; ఇట్లువిను—

ఆ. వె. ఎంతకాలమైన నెలజవ్వనమె నిల్చు
ముదిమి రాదు నెడదు మోవికావి

నిడుదకన్నులబెళుకు నెమ్మోనితళుకు
సంతకంత కెచ్చు నచ్చరలకు.

వజ్ర—నాకంటి కాఁడువాండ్రందఱు సొగసుగనే గనఁబడుదురుగావున చక్కదనమున నెక్కువతక్కువలు నిర్ణయింపఁజాలను. కాని మీపలుకులంబట్టి వేల్పువెలయాండ్రకు మరణము లేకపోవుటయేగాక ముదిమియు లేదని తెలిసెది. పోనీ. అందఱు కొంపలు దీయుచు ఊళ్ళేలాగున బ్రతుకనిమ్ము.

నర—వజ్రకంఠా! మననిశుంభుఁ డేలొకో కడునాలస్యము చేయుచున్నాఁడు. ఊర్వశి వానికిఁ గనఁబడియుండదా? కనఁబడిన రానొల్లదా? ఆలస్యకారణ మేమో నీవుపోయి తెలిసికొనివచ్చెదవా?

వజ్ర—నాకింతకన్న నుద్యోగ మేమున్నది? అట్లే పోయెదను. ఓదైవమా! అందఱు నాచుట్టునుదిరిగి నాకాళ్ళపైఁబడునట్లు నన్నొకస్వర్గలోకపు భోగముదానిగ జేయక యీదిక్కుమాలినపుట్టుక యేలపుట్టించితివి? (అని కొంచెమునడచి) అమ్మయ్యా! నాయదృష్టము బాగున్నది. ఊర్వశిం దోడ్కొని యదిగో నిశుంభుఁ డిటకు వచ్చుచున్నాఁడు.

నర—(దిగ్గునఁ లేచి) ఏది? నాయూఱప్రాణము!

వజ్ర—అదిగో! మననిశుంభునివెనుక నడుగులు లెక్కపెట్టుకొనుచుఁ దలవంచుకొని పెళ్ళికూఁతురువలె నడచి వచ్చుచున్నది.

నర—వజ్రకంఠా! మహేంద్రుఁ డూర్వశి నిచ్చట విడిచిపోవుటచే గామగవియు నమృతభాండము మొదలగు దివ్యవస్తువులను దివమునుండి తరలించుకొనిపోయె నని నాకిపుడు విచారములేదు.

క. నాపాలిసురభి యిదియే
నాపాలిఁటిపారిజాతనగ మియ్యదియే
నాపాలియమృత మిదియే
నా పాలిఁటిగన్ను మిదియె నానిధి యిదియే.

వజ్ర—వెఱ్ఱికి వేయివిధములు. అందులో నిది యొకటి.

నర—ఓరిమూర్ఖుఁడ! జగన్మోహన మగు దానియాకార మొక్కసారి కన్నులకఱవుదీరఁ జూడుము. ఆహాహా! నాకన్ను లింతకాలమునకుఁ జరితార్థత నొందినవి.

సీ. లావణ్యమును గ్రక్కులలనమోమును జూచి చూడనక్కరలేదు సోము నింక
సిరికిఁ దానకమైన చెలువచూడ్కిఁ దలంచి తలపనక్కరలేదు తమ్మిరేకు

మిఱుమిట్లు గొలుపు నెమ్మోమిదన్నియ నెంచి యెంచనక్కఱలేదు మించుమాట యుండిలేనటు లుండు నువిద నెన్నడు మెన్ని యెన్ననక్కఱలేదుమిన్ను ద్రోవ.

తేటతేనియబావియౌ తెఱవమోవిఁ
జెప్పిచెప్పనక్కఱలేదు చిగురుపేరు
పోలఁతి జఘనమండలి పొంతఁబోయి పిదపఁ
బోవఁ బనిలేదు మిన్నేటిపులినములకు.

మఱియును,

ఆ. వె. ఇంతికన్ను లుండ నించువిల్కానికిఁ
మీన మేల? వేరుబాణ మేల?
కలికిప్రాపుఁ బడసి కాఁబోలు సుమ డిట్లు
లోఁడలు మఱచి తిరుగుచున్నవాఁడు.

[అప్పుడు, నిశుంభుఁడను రాక్షసుఁడు, ఊర్వశితోఁ బ్రవేశించుచున్నాఁడు]

ఊర్వ — (తనలో) గంధర్వులగు నచ్చరల యదృష్టములు తిన్ననగుటచే వారీదురాత్మునిదృష్టిపథమునఁ బడకుండ నావలకుం దాఁటిరి. మందభాగ్యురాల నగు నే నంతటిపుణ్యము జేసికొననైతిని. ఇంతకు విధినియోగము దుస్తరము. అచ్చరనైన నేమి? వేల్పుదొరప్రాపకము గావించిన నేమి? ఇడుములు గుడువవలసినకాలము వచ్చి నప్పుడు తప్పునా? రాక్షసులే తులువలు. అందు నరకుఁ డధమాధముఁడు. వానియనుచరుల చర్యలం జూచి మహాపాతకు లందఱుఁ దలలు వంచుకొనవలయు. వీనియెదుటికి రాకయుండదని యెన్నివిధములఁ బ్రయత్నించినను సాగదయ్యె. అయినను బడఁతుల బలిమిఁబట్టి మానభంగము సేయు నరకహతకునిబారినుండి తప్పించుకొనుటకు దైవ మేదయిన నొక్కయుపాయముఁ దోఁపింపఁడే? (తలవంచి నిలుచున్నది.)

నిశుం — (తనలో) స్వామి కేది మనఃప్రియ మగు నది సేయువాఁడే విశ్వాసము గలసేవకుఁడు. యజమానుల యాజ్ఞఁ జెల్లింపక వారిమేలుకొఱకే వారిమాటలు మేము నిరాకరించుచున్నవార మని చెప్పు సేవకులు కేవలము కృతఘ్నులు దండ్యులు నని నా యభిప్రాయము. మంచిదే కాని చెడ్డదే కాని రాజాజ్ఞ చెల్లి తీరవలయును. అందుచేత నే యూర్వశీవిరహతాపమున దురపిల్లు మహారాజునకు నేను వాంఛితార్థసిద్ధిఁ జేసితిని. నా రాజభక్తికి నరకుఁడు శాశ్వతకాలముఁ గృతజ్ఞుఁడై యుండును. (రాజును సమీపించి ప్రకాశముగా) మహారాజా! జయము! జయము!

నర—మిత్రుఁడా! నీవు కావించిన మహోపకారమునకుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాఁడను.

నిశుం—దేవరవారికి నేను జేయవలసినపనియే చేసితినిఁ గావున స్తోత్రము నకర్హుఁడ.

వజ్ర—ఈనిశుంభునకు సైన్యాధిపత్యమున నున్న నేర్పుకంటె మహారాజునకు మిండకత్తెలను దార్చుటలో నెక్కువప్రజ్ఞ యున్నట్టు కనబడుచున్నది. వాని నిఁక మీఁద నిట్టియుద్యోగములో నుంచుటయే మంచిది.

నిశుం—ఓరిమూర్ఖుఁడా! వజ్రకంఠా! సింగము నాశ్రయించిన నక్కవలె రాజాశ్రయమున నీవు నిర్భయముగఁ జరించుచున్నాఁడవు. ఇప్పు డీమహారాజుమొగము జూచియేసుమా నీప్రాణములు నీశరీరములో నే నుండనిచ్చినది.

నర—మిత్రమా! ఈయన్యస్తనిమాటలు మొగమెనుండియు నీవెఱుఁగినవేకదా?

నిశుం—దేవా! వానిమాటలు నేను కొనసేయ. ఇదిగో యూర్వశి వచ్చి జంత్రపుబొమ్మవలె నిలుచున్నది. దేవర యనురాగావలోకనముల దీనిపైఁ బఱపి మన్నింపుఁడా.

నర—మిత్రుఁడా!

తే, గీ. వేయికన్నుల నయనంబు వేల్పుఱేఁడు
తరుణిలావణ్యమును జూచి తనివిఁ జెంద
యున్నవాఁడన నేఁ దృప్తి నొందఁగలనె?
కనులు రెండింటితో నొక్కఁడిను జూచి.

గౌతమిశాపము మహేంద్రునకు నిజముగ నీవిషయమున సఫలమైనది. ఈసమయమున నేను సహస్రాక్షుఁడను గాకపోవుటయు నొకలోపమే.

వజ్ర—అది యెంతభాగ్యము. ఏమునిమో పట్టుజాలనికోపము వచ్చినప్పుడు మన కంతటిభాగ్యముఁ గలుగఁజేయకపోఁడు.

నిశుం—ఊర్వశీ! కొయ్యబొమ్మవలె నిలచియుండెదవేల? మహారాజునకు మొక్కుము.

ఊర్వ—(తనలో) కటకటా! మహేంద్రునకు వేల్పులనిండోలగంబున జోహారుసేయు చేతులతో నీదానవాధమునకు మ్రొక్కవలసె. (ప్రకాశముగా) దానవేంద్రా! నమస్కారము.

నర—(తనలో) దీనినిప్పు డేమని దీవింతును? నామనసులో భావము తేటబడునట్లాశీర్వదింపవలెను. (ప్రకాశముగ) ఓత్రిభువనరత్నమా!

నామె యిప్పుడు ముప్పతిప్పలు పెట్టి మూఁడుచెఱువులనీళ్లు త్రాగించుచున్నది. ఇన్నాళ్లు బ్రతికి యింటివెనుకఁ జచ్చె నన్నట్లు మహేంద్రాదుల గెల్చిన దానవసార్వభౌముఁడు తుద కాఁడుదానిచేతఁ బడునేమో యని భయము కలుగుచున్నది.

మంద—సరే. ఇంక మనదారి మనము చూచుకొనవలసినదే. నీప్రాణరక్షణ మెట్లు చేసికొనియెదువు?

వజ్రి—మనము కామరూపులము గద. అందుచేత నేను నందినో పందినో కుక్కనో నక్కనో పిల్లినో నల్లినో బల్లినో గొల్లినో కేకినో కాకినో చీమనో దోమనో తాయినో అప్పనో చెట్టునో చేమనో యై ప్రాణములు దక్కించుకొనియెద. నీ వెట్లు దక్కించుకొనియెదవు ?

మంద—నేను నీవలె తుచ్ఛజంతువునై ప్రాణములు గాపాడుకొనను. నే నేనుఁగు నయ్యెదను.

వజ్ర—ఏనుఁగు వగుట యబద్ధము. పీనుఁగు వగుట నిజము.

(తెరలో)

క. అని దివిజేంద్రుని గెల్చిన
దనుజేంద్రుఁడు మూర్ఛవోయెఁ దనయరదముపై
మనుజాంగనచే హతుఁడై
వినిరే యెవ్వరైన నిట్టివింతలు జగతిన్.

వజ్రి—హా! చచ్చితి; చచ్చితి.

మంద—అయ్యో! అయ్యో! ఇంక దిక్కెవ్వరు?

వజ్ర—(పరికించి చూచి) ఇదిగో గరుడధ్వజముగల శ్రీకృష్ణునిరథమును సారథియై పునకే తోలుకొనివచ్చుచున్నాఁడు. నరకమహారాజును మూర్ఛిల్లఁ జేసిన యాబాలిసకూఁతురు నిన్నును నన్నును చెటియొకబాణమునఁ గెరఁజేయఁగలదు. కావున నిప్పుడే కాళ్ళసత్తువకొలఁది పరుగెత్తుదము రమ్ము.

మంద—ప్రస్తుత మింతకన్న వే ఱుపాయము లేదు. పదపద.

(అని యిద్దరు నిష్క్రమించుచున్నారు.)

ఇది నిష్కంభము.

---

[అంతట రథారూఢులై శ్రీకృష్ణసత్యభామలును రథముఁ దోలుచు సారథి యగుదారకుఁడును ప్రవేశించుచున్నారు.]

దార—దేవా! దేవీ! నరకుఁడు మూర్ఛనుండి తేరువఱకు నరదము నీమఱ్ఱిచెట్టు నీడ నిలిపెదను. రణరంగమున వీరవిహారము సలిపిన దంపతుల కిందలి మందమలయానిలంబు లుపచారము చేసి శ్రమ మపనయింపఁ గలవు.

సత్య—దారకుఁడా! నీవు చక్కనిపనిఁ జేసితివి. ఇప్పుడు ప్రాణేశ్వరుని యాయాసము సంపూర్ణముగ నపనయింపఁబడు.

కృష్ణ—సుందరీ! నాశ్రమ మేమున్నది? శ్రమయంతయు నీదే. ఏలయన.

చ. చురుచురుక్కుమంచు మెయి సోకఁగ దానవుఁ డమ్ము లేయుడున్
మెరమెర దోప నేను మిసిమింతుఁడనై పడియుండఁ జూచి నీ
చెఱఁగునఁ జెమ్మటల్ దుడిచి చేతిధనుస్సు గ్రహించి దానవుల్
వెఱచఱవన్ బొనర్చితివి వీరవిహారము మెచ్చ నెల్లరున్.

సత్య—శరీరమం దలఁతఁ జెందినయవయవములు విశ్రాంతిఁ జేకొనుచుండ నలఁత పడనియవయవములు పని చేయుట ప్రకృతిసిద్ధము గదా. అందుచే నరకశరీర మలసి నప్పుడు తక్కినసగము మేను సమరము నడపినది.

కృ—కళ్యాణి!

తే. గీ. సాటి యెఱుఁగని నీ మేని చక్కఁదనము
ముందు సతులెంత సిగ్గును బొందఁగలరొ
ప్రతి యెఱుంగని నీపరాక్రమము ముందు
పురుషు లంతియసిగ్గును బొందఁ గలరు.

సత్య—దేవా! ఇందు నాప్రజ్ఞ యేమున్నది.

తే. గీ. కారణంబులు దీనికిఁ గలవు రెండు
కమలనాభ! మీసాన్నిధ్యగరిమ యొండె
బగతుదౌర్బల్య మొండెఁ గావలయు సుమ్ము
కాక నే నేమి దైత్యులఁ గలఁచు టేమి.

కృ—ఈరెండును గారణములు కావు. ఇది కేవలము వినయవృత్తి. పగతునిచేత నలయింపఁబడిన నేను నీవిజయమునకుఁ గారణ మెట్లగుదును?

క. ఎగిరిపడితి నిన్నాళులు
మగవాండ్రభుజాబలంబు మాట గనక నీ

ర్గగు నిప్పుడు మీముందర
మగువా ! యిఁక సాగిరావు మా మగతనముల్.

మఱియు,

తే. గీ. ద్వాపరమ్మున రెండుచిత్రములఁ గంటి
జలజలోచన నీ సాహసంబుకతన

సత్య—ఆ చిత్రములు వినఁగోరెద.

కృ—ఆఁడువారికి పౌరుషం బమరు టొకటి
యబలభావంబు మగవారి కబ్బు టొకటి.

దార—ఇం దతిశయోక్తి యేమియు లేదు.

సత్య—అఘటనఘటనాసమర్థు లగుపరమేశ్వరులు స్వయముగ సమరవ్యాపారము నడపుచుండ నట్టిచిత్రములు పొడకట్టుట యొకవింతగాదు.

కృ—కళ్యాణి ! నీసుశీలముచేత నీవిజయము నా కారోపించుచున్నదానవు; కావున నేను దానిని బరిగ్రహించుచున్నాఁడను.

దార—వీరపుత్రికయు వీరపత్నియు నగు నీదేవిచరిత్రము మహిషాసురుని మర్దించి దివిజలోకమును నిష్కంటకముగా నొనర్చి వాసుదేవునకు మహానందము గలిగించిన కాత్యాయనివృత్తాంతమును దలఁపించుచున్నది.

కృ—దారకా ! నిజము నిజము. ఈ మెచరిత్ర మట్టిదే. ఓసుందరీ ! ఆసమరసమయమున నీరూపము మిక్కిలి దర్శనీయమయి యుండెను. ఎట్లంటేని,

సీ. శ్రమమునఁ బొడమిన చెమటచిత్తడిచేతఁ గస్తూరితిలకంబు కరఁగిపోవ
నృత్యముం బొనరించు నెమలిపింఛమయట్లు వెడఁదవేనలి జాటి వెన్ను నిండఁ
దియ్యవిల్లుం దూఁగుతీఁగెయుయ్యాలలట్టు లాణిముత్తెపుసరు లల్లలాడ
గుణనినాదమునకు గొనబైనలయవోలె ముంజేతికడియముల్ మొరయుచుండ

నవనవాంగకములశోభ నవయకుండ
నవక మించుకయేనియు నలఁగకుండ
వెడఁదతూపులు చూపులు వింటఁగంటఁ
బరునిమీఁదను నామీఁద బరపి తబల.

సత్య—ఈవిజయము ఘుణాక్షరన్యాయముగ లభించినదైన నీస్వల్పకార్యముచేత మీమెప్పునకుం బాత్రురాల నయితినని సంతసించుచున్నదానను.

దార—దేవా! ఇంతవఱకు పురుషులేగాని స్త్రీలు సాంగ్రామికవ్యాపారము లకుఁ దగువారు కారని నేఁ దలఁచితి. ఈపూజ్యురాలి యతిలోకచాతుర్యముచేత నే నాయభిప్రాయమును మార్చుకొనవలసె.

సత్య—దారకా!

క. మగవారి నెల్లపనులకుఁ
దగువారినిగా నొనర్చి, దైవము స్త్రీలన్
దగనటుచేసెనె, మగువలు
తగియెదరొ తగరొ దైత్యదమనుఁడె యెఱుఁగున్.

కృ—దారకా! అంగనలు—

మ. చదువన్నేర్తురు పూరుషుల్వలెనె శాస్త్రంబు ల్పఠింపించుచో
నదమన్నేర్తురు శత్రుసేనల ధనుర్వ్యాపారము ల్మెచ్చుచో
నుదితోత్సాహముతోడ నేలఁగల రీయుర్విన్ బ్రతిష్ఠించుచో
ముదిత ల్నేర్వఁగరానివిద్య గలదే ముద్దార నేర్పించినన్.

దార—దేవా! స్త్రీలు ప్రకృతిసుకుమార లగుటచేఁ బురుషప్రాపణీయములగు మోటుపనులకుం దగ రనుకొంటి.

కృ—పువుబోండ్లమేనులు సహజముగ [మృదువు లయినను గాలానుగుణముగ శ్రమము సహింపఁగలవు.

తే. గీ. కరము స్పృశియించుమాత్రానఁ గందిపోవు
మల్లె సంపఁగిలోనగు మంచిపువులు
పృథివి శోషిల్ల గాడ్పులు విసరునట్టి
మండువేసఁగిఁ బొదలుచు నుండుఁ గాదె.

[తెరలో]

ఓరోరి యాదవపాంసనా! భార్యాభుజబలార్జితయశోగర్వితా! నిలునిలు. పాఱిపోకు.

మ. అని నేమూర్ఛిలినంతమాత్రమున దైత్యస్వామి నాచేత నీ
ల్గినవాఁడంచును సంతసించి నను గేలింగొట్టుచున్నాఁడవా?
విను నామూర్ఛకుఁ గారణంబు వనితావిక్రాంతియే గాని నీ
ఘనదోస్సారము కాదు సిగ్గుపడ కీగర్వంబు నీ కేలరా?

సత్య—పిడుగువంటి యీధ్వని యెవ్వనిది?

దార—ఇది నరకునికంఠధ్వనియే.

కృ—హృదయేశ్వరీ!

తే. గీ. మొదట నీవాఁడితూపుల మూర్ఛవోయి
యసుర క్రమ్మఱఁ దెలివొంది యని యొనర్ప
నలుక రెట్టింప మనపైకి నరుగుదెంచె
వేటువడిన బెబ్బులివోలె నెగిరిపడుచు.

[అప్పుడు రథమెక్కి సూతసమేతుఁడై నరకాసురుడు ప్రవేశించుచున్నాఁడు.]

సూతు—రాత్రిసేశ్వరా! ఇదిగో శ్రీకృష్ణుఁడు రథారూఢుఁ డయి యుండు న్నాఁడు.

నర—ఓరోరి యాదవపాంసనా! భార్యాభుజబలాశ్రితయశోగర్వితా! నిలునిలు. పాఱిపోకు.

ఉ. అని నే మూర్ఛిలినంతమాత్రమున దైత్యస్వామి నాచేత నీ
ల్గినవాఁ డంచును సంతసించి నను గెలిం గొట్టుచున్నాఁడవా?
విను నామూర్ఛకుఁ గారణంబు వనితావిక్రాంతియే గాని నీ
ఘనదోస్సారము కాదు సిగ్గుపడ కీగర్వంబు నీ కేలరా?

కృ—ఓరోరి నిశాటకులపాంసనా! ఇందు మాకు లజ్జాకారణము లేదు.

క. మాయింటియాఁడువాండ్రు న
జేయుల మని విజ్జ్వీఁగు చెనఁటియసురులన్
మీయట్టివారి గెలువఁగ
నాయత గర్వంబె గాక యటు సిగ్గేలా?

మఱియు నోపిశితాశన!

తే. గీ. అష్టదిక్పాలయుతుఁ డైనయమరవిభుని
వెళ్ళఁడిన జయించిన మహావీరుఁడ వయి
యాఁడుదానిచేఁ దుద కిట్టు లయితి వనుచు
సిగ్గుపడి చావ కిట్లు వచ్చితివి మరల?

నర—ఓరివాచాట! మీయింటి యాఁడువాండ్రు సాహసము కలవారె. ఇందు నీవు నిజమే పలికితివి.

ఉ. కొంకక నీదుచెల్లెలు తగుల్కొనిపోయెను బాండుపుత్రునిన్
జంకక రుక్మిణీరమణి నాఁడు తగుల్కొని వచ్చె నిన్ను నీ
వంకగ నున్నయంగనల ప్రజ్ఞలకా గరువించుటెల్ల ఛీ!
యింకను నీది యొక్కబ్రతుకే యని మాటల నాడఁ జొచ్చితే?

మఱియు నియ్యది నీకు గౌరవమే యయినపక్షమున,

చ. అలయక సత్యభామమగఁడై నిను నేలుచునుండు, నింట గా
జులు తొడిగించుకొంచు నొకచోటను గూరుచునుండి భార్యవై
మెలఁగుము దానికిన్, మగఁటిమిన్ బెడబాసినభర్త భర్తయే
పొలియక యప్పుడే బ్రతికిబోతివి దగ్గఱ భార్య యుంటచేన్.

దార—అయుష్మంతుఁడా! మరియాద నతిక్రమించి నడచువారితోఁ బ్రసంగించు టొప్పదు.

కృ—దారకా! అగును. ఏవీ విల్లిటు దెమ్ము?

సత్య—ప్రాణేశ్వరా! ఒక్కసారి మీరూరకుండుఁడు. వీనితో నే నించుక ప్రసంగించెదను.

కృ—సుందరీ! అనఁదగినమాటయు ననఁదగనిమాటయు నెఱుఁగనిరాకుమారుఁడు సుమీ యితఁడు. ఇంతియగాక నీబాణప్రహారములచే నీవలన మనసు నొచ్చియున్నవాఁడు గావున మహాభిజాత్యముగల నిన్ను వీఁడు గౌరవింపఁడని తోఁచెడును. మఱియు,

తే. గీ. చెనఁటికి హితోపదేశంబు చేయు టరయఁ
బెద్దపులికి ధర్మములు చెప్పెడు తెఱంగు
కఠినులకుఁ గృపఁ గలిగింపఁ గడఁగు టెల్ల
రాతినేలల నూతులఁ ద్రవ్వు టబల.

సత్య—అది నే నెఱుఁగుదును. అయినను నన్నొకసారి పలుకనిండు. ఓప్రాగ్జ్యోతిషాధీశ్వరా! ఇంచుక శాంతింతువేని యొక్కమాట చెప్పెద.

చ. పొడమితి వాదిదేవునకు భూసతికిన్ బ్రియనందనుండవై
యడఁచితి వష్టదిక్పతుల ఖ్యాతి వహించితి విట్టు లుండియున్
గడపితి వింత కాలమును క్రౌర్యమె సేయుచు నింక నేనియున్.
జెడక ముకుందుపాదసరసీరుహముల్ భజయింపు భక్తితోన్.

వెండియు నితఁడు,

తే. గీ. మునులకేని జిక్కనివాఁడు మొదటివాఁడు
పతితులను బావనులఁ జేయు వ్రతమువాఁడు
తొంటిపుణ్యంబునను నీకు దొరకినాఁడు
భక్తిభజియింపఁ గదవయ్య పరమపురుషు.

నర—ఓసత్రాజిత్పుత్రీ! ఏమీ ! నీమగండు పరమపురుషుఁడా? ఈజగద్వంచకుఁడు భగవంతుఁ డెట్లయ్యెనో చెప్పెద వినుము.

మ. తెలి వొక్కింతయు లేనితాపసులు నీతిభ్రష్టుఁడౌకృష్ణు ఆం
కులుబొంకు ల్వేయినోళులం బొగడుచుం గోరంతలౌ తద్గుణం
బులు కొండంతలు చేసి విష్ణుఁ డని సంపూజింప నానాబళా
బళీ నే నే హరినంచు సిద్ధుఁయి తా వచ్చెం ద్రపాహీనుఁడై.

క. భగవంతునియవతారం
బగు నని వర్ణించుచుంటి వబలా వీఁడా
భగవంతుఁడు ఛీ! వీఁడే
భగవంతుఁడైన జనులపా ట్లేమందుఁన్.

మఱియు !

ఆ. వె. ఉల్లి మల్లెయౌనె పిల్లి బెబ్బులి యౌనె
కాకి కేకి యౌనె కలువకంటి
కుక్క గుఱ్ఱమౌనె గోవౌనె గోమాయు
వాదిదేవుఁ డౌనె యాదవుండు.

సత్యభామా ! ఇతఁడు నీపతి యగుటచే నభిమానవశంబున నిట్లుపలుకుచుంటివి; కాని మావంటి యుత్తమపురుషులు వీని నాశ్రయించుటకు వీనియం దేగుణములున్నవి?

సీ. కులగౌరవముఁ జూచి కొనియాడు మందువా యదువంశజునికన్న నధముఁడెవఁడు
విక్రమంబునుజూచి వినుతింపు మందువా వాసుదేవునికన్న పందయెవఁడు
అభిమానధనుఁ డంచు నర్చింపు మందువా నీ ప్రాణపతికన్న నీచుఁడెవఁడు
సుగుణసంపద మెచ్చిస్తుతియింపు మందువా గోపాలకునికన్న కూళయెవఁడు.
యేలుటకు నంగుళం బేని నేలలేక
పాండుసుతులపంచను జేరి బ్రతుకువాని
కులము బలమును మానంబు గుణము గలిగి
నేఁడు నే నేమి చేరి మన్నించు టేమి ?

ఓవీరపుత్రీ ! పతుఁడవైనను నేను నీవిషయమై జాలినొందుచున్నాఁడను. ఏలయన;

క. చక్కనిచుక్కవుగదె నీ
కెక్కరణిని దాపురించె నీతుంటరి ని
న్నిక్కుమతి కిచ్చుట రుచుల్
గ్రక్కెడు మణిని మసిపాతఁ గట్టుటఁ గాదే !

నీసాహసంబునకుఁ జక్కఁదనంబునకుఁ గులగౌరవంబునకుఁ దగనిమగనిం గట్టుకొని నీవు హాస్యాస్పదురాలవైతివి.

దార—ఓయీ! రాక్షసా! మహామహిమలచేతనే యితఁడు పరమపురుషుఁడని జ్ఞాను లందఱుఁ దెలియుచుండ నీవెఱుంగఁజాలవా?

నర—ఓహో! మహిమలవలన జ్ఞాను లెఱింగిరా!

తే. గీ. తోడిదొంగలౌ మునులను గూడఁగట్టి
గడుసుఁదన మెఱుంగనివారి కన్నుఁ బ్రామి
మాయ లింద్రజాలములు వేమాఱు చేసి
నంతమాత్రాన భగవంతుఁ డగునె వీఁడు.

సత్య—దేవా! ఇంతగా రేఁగిన యీదనుజుని పొగరుదుమారము శరాసారము చేతఁగాని యడఁగదు.

కృష్ణ—దేవీ! నేను మొదటఁ జెప్పలేదా?

తే. గీ. సన్నిపాతసంగతమైన జ్వరముచేత
నొడ లెఱుంగక ప్రేలుచు నున్నరోగి
చేవ గలవేఁడిమందులచేతఁ గాక
చక్కఁబడునొక్కొ శైత్యోపచారతతుల.

అందుచేత నేనే వీనిదుర్మద మడంచెద. నీ వుండుము.

సత్య—హృదయేశ్వరా! అవును. నేనొకసారి వీనిని మూర్ఛపుచ్చఁ గలిగితిఁ గాని సంహరింపఁజాల; ఖండితానేకదైత్యేంద్రమస్తమగుమీహస్తమే వీనిని విధ్వస్తము గావించుఁగాక!

నర—ఆహాహా! ఆయిల్లాలు మెచ్చుకొనుట కీమగఁ డామెప్పు నంగీకరించుటకు సరిపోయినది. ఓరోరి చంద్రవంశకళంక! నీవా నాదుర్మద మడంచువాఁడవు.

చ. అణఁచితి గాదె మాగధు బృహద్రథనందనుదోర్బలంబుచే
నణఁచితి గాదె కాలయవనాదిబలాఢ్యుల విక్రమించి నీ
వణఁచినవారె ముజ్జగములందు గణించినశూరు లెల్ల హా!
వణఁకుదయించె దిక్కెవరపాయము వాటిలె నేమి సేయుదుక్.

కృష్ణ—కాల మాసన్న మయినది, తొందరపడకుము.

మ. తులువా! నీతలఁ దన్నినట్టిఘనదైత్యుల్ చండదుర్వారదో
ర్బలసంక్షోభితశత్రుభూధరచమూరత్నాకరుల్ వ్రేల్మిడిక్

శలభంబు ల్బలె మ్రగ్గినారు సుమి మచ్ఛక్రాగ్ని నీ వెంత చ్ర
క్కులు గావించెద మస్తకం బిపుడె నీగర్వంబుఁ ద్రక్కించెదన్.

ఉ. ఏటికి నీచుతోడ నిపు డీగతి నున్నను బుద్ధిరాదె యే
నాటికినైన నంచును మనంబున న స్గణియింపకున్న నా
నాఁటికిఁ బిచ్చలించె భువనంబులు నీ పెనుదుండగంబులన్
నేఁటికిఁ బండబాఱినది నీదురితంబు నిమేష ముండరా!

నర—నీవు న న్నశక్తదుర్జనత్వముచే సైరించుచున్నాఁడవు గాని చెల్లుబడి కలిగి కాదు. మే మన్ననో ని న్నొక్కత్రుటిలో నిగ్రహింపఁగలము.

చ. మగఁటిమిలేని యీపనికిమాలినభీరువుతోడ నేటికిం
బగ యని యెంచి నీపలుకుఁ బాడిగ నెంచక నిన్ను ద్వారకా
నగరమునుండి యెన్నియొ దినంబులక్రిందట సాగఁదోల కీ
పగిదిని వీడఁగా బొగరువట్టితి క్రొవ్వడఁగింతు నుండురా!

నీచకార్యిన్న నసేకదనుజులు మగ్గిరా?

శా. ఏఁడీ వ్రేలుమడంచి చెప్పు మని నీ వేపీరు న్యాయంబుగా
నోడం బుచ్చితొ హంసునా, డిచికునా యోగ్యుం జరాసంధునా
పాడిం దప్పియె పిల్కుమార్చితివి యీభవ్యాత్ములం జాలు నీ
యేడాగోడపుఁబల్కు లేల నిలు ని న్నేఁ డాట లాడించెదన్.

నీకొకదానిలోమాత్రము విశేషప్రజ్ఞ యున్నది.

శా. పోరాటంబులు బెట్టి యొండొరులకుం భూపాలకశ్రేణిలోఁ
జేరంబీయుచు నందు నొక్కని బయింజెండాడి యెట్టెట్లొ భూ
భారం బంతయు బాపినాఁడ నిదె నాప్రజ్ఞాబలం బంచు నూ
రూరం బల్మరుఁ జాటఁ బంచెదవుగా యోహో యసన్ భూజనుల్.

అన్నిఁటి కేమిగాని నన్ను మాఁటిమాటికిఁ బాపాత్ముఁడనని పలుకుచుంటివి. దానశీలుఁడ నయి బహుక్రతుఁడనై వేదవేదాంగవిదుఁడనయి మహేశ్వర చరణారవిందధ్యానైక చిత్తుఁడనయిన నేను నీకన్న నెక్కుడుపాపంబు లే వొనర్చితినో యొక్కసారి సెలవిమ్ము.

కృష్ణు—ఓమూర్ఖుఁడా!

శా. వేదంబుల్ తలక్రిందుగాఁ జదువనీ; విప్రాళి కర్పింపనీ
భూదానాదులు; చేయనీ శతమఖంబుల్; భక్తిపల్లింప నీ

వేదాంతార్థము; ముక్తినొందఁడు సుమీ పృథ్విన్ దయాసత్యశౌ
చాపల్ దవ్వుగ ద్రోలుచుం దిరుగు మోహాంధుండు దైత్యాధమా.

నీపాపంబు నీ వెఱుఁగవా? నీయంతరాత్మ నిన్నుఁ బీడించుట లేదా?

మ. మునులం జంపితి జన్నపుంబశువులన్ మ్రుచ్చిల్లి తంతఃపురాం
గనలన్ బల్మినిబట్టి తెచ్చితివి స్వర్గంబెల్లఁ జూఱాడి తె
స్నని వర్ణింతును జెప్పవచ్చును మితంబైనన్ మహీస్నివుచే
యని దోసంబులు చెందరానిగతు లెంతైనం గనన్ వచ్చునే.

నర—(నవ్వుచు) ఓరోరియదువంశజలధిబడబానల! ఈదోసంబులు కొన్ని నా యందుకాదు నీయందుఁ బొడగట్టుచున్నవి సుమా!

మత్తకోకిల. చేసినాఁడవు స్త్రీవధంబును జిన్ననాఁటను గూళవై
చేసినాఁడవు గోవధంబును జేడెనీల నిమిత్తమై
తీసినాఁడవు మామప్రాణము దిక్కులేని యవస్థ నీ
చేసియుండని దోస మున్నదె సిగ్గుమాలిన ప్రేలరీ!

అదియటుండనిచ్చి నేనొక్కటి యడిగెదను. దానికుత్తరమిమ్ము.

క. శిశుపాలుఁడు మఱఁది గదా
శిశుపాలుఁడు వలచినట్టి చేడియనీకున్
విశదముగఁ జెల్లెలేగద
పశువా! యేమనుచు దానిఁబట్టితి చెపుమా.

దోసంబులన్నియు నీయంద యుంచుకొని మీఁదు మిక్కిలి మమ్ముఁ గలుపాత్ములనియెదవా? శాత్రవదుర్నిరీక్షవిక్రమక్రీడారంభులనయి తేజోవిహీనుఁ డగుబిడౌజుని దిక్పాలకసమేతముగా నోడిసిపుచ్చి జగత్త్రియం బాక్రమించుట నేరమగునా? ఇది క్షాత్రః గాదా? పాలుఁబోతు వగు నీకు క్షాత్రవేమి తెలియును?

కృ—రాక్షసాధమా! క్షాత్రమనుసరింపఁ దలచినచో నీవు త్రివిష్టపముపై దండెత్తవచ్చును. సహజవైరి యగునుపేంద్రు నెదిరించి గెలువవచ్చును—కాని—.

మ. నిను నిందించిరె, నీపయిం గనలిరే, నీజోలికిన్ వచ్చిరే,
మనుచుం గానల ముక్కు మూసికొని బ్రహ్మధ్యానముం జేయు స
న్మునులఁ గొట్టితి వేమి చేసిరి మహాత్ముల్వారు లాలోకపా
వనులం జంపుటయా పరాక్రమము నాపైఁజూపు నీతేజమున్.

సీ. క్షుద్రాత్మనకు నీకు జోహారులొనరింప బలహీనుఁ డగువజ్రిపాణి గాఁడు
నీదళంబులఁజూచి నిర్విణ్ణులైపాఱ ముక్కు మూసికొను వెఱ్ఱిమునులుగారు
నీవిగ్రహముఁ జూచి నిశ్చేష్టులగుటకు ననదలౌ రాజకన్యకలుగారు
నీవిభీషికలచే నివ్వెఱపడుటకుఁ బరమసాధువులు భూసురులుగారు

ఎవ్వఁడుగఁ దలంచితివో నెదనునన్ను
సకలభూతభయంకరజన్వరంగ
ఖండితానేకదైతేయ కంఠనికర
దేవతాచక్రవర్తిగాఁ దెలిసికొనుము.

నర—ఓగోరియాశ్వరమ్మకస్య! నీవు భగవంతుఁడ వని యీవఱకు నీభార్యసత్య భామ వచించినది. ఇప్పుడు నీనోటనే వినుచున్నాఁడను. ఇట్లు దలంచుట నీనేరము గాదు. చదువులు నేర్చిన దుష్పండితులు కొందరు జగద్వంచనము చేయఁదలఁచి—

సీ. కటిమొద్దువోలు నీ కాయపుంజాయలు కారుమబ్బులకు సంగడము లనిరి
నీప్రచ్ఛాదనములు నీటంకుకతలు నీలేకిపనులు విష్ణులీల లనిరి
నీవంచకత్వంబు నీగుట్టు వెలిఁబుచ్చు ధర్మాత్ములను దుష్టదైత్యులనిరి
నీకు గులాములై నిరతంబు గొనియాడు తెలివిమాలినవాండ్ర దివ్యులనిరి

అన్నిగొనములయందు నీ కన్నయైన
త్రాగుఁబోతును శేషావతారుఁ డనిరి
ఒక్కపూఁటకు గతిలేనిబక్కవాని
విశ్వమయుఁడగు నమ్మహావిష్ణు వనిరి.

నేను నారాయణుఁడ నని నీలోనీవెంత మురిసినను మువ్విమ్రుచ్చులు నిన్నెంతగొనియాడి నను నీ వచ్యుతుఁడవుగావు. నక్క పార్వతియగునేని, కప్ప నారాయణుఁడగు నేని నీవు హరివగుదువు. నారెయెతింగినంతవఱకు,

శా. నీకన్నం గడు దుష్టకష్టమతియు న్నీకన్నఁ బాపాత్ముఁడున్
నీకన్నంగఠినాత్ముఁడుం గుజనుఁడు న్నీకన్న దుర్మార్గుఁడున్
నీకన్నం బలుకాకియుం జెనఁటియు న్నీకన్న దుశ్శీలుఁడున్
నీకన్నం జడుఁడుం గనంబడఁ డిలన్నిర్భాగ్యదామోదరా!

నలువురనో మువ్వురనో బక్కరక్కసుల దొంగపోటునఁ జంపి దనుజాంతకుఁ డనునలీకపౌరుష నామము ధరించి బెదరింపఁజొచ్చెదవా? ఒకవేళ నీవనుకొన్నట్లుభగవంతుఁడవే యగుదువు కాక!

క. భగవంతుఁడవేయైనను
భగవంతునితాతవైన భయపడఁజుమీ న్మ
తెగటార్చెద పగఁ దీర్చెద
మగవాఁడవయేని నిలిచి మార్కొను నన్నున్.

సత్య—(మెల్లఁగా) ప్రాణేశ్వరా! ఎంతనే పితఁ డొోడలుమఱచి ప్రేలుట.

కృష్ణ—సుందరీ! ఈతనిప్రల్లదంబు లిప్పుడే తుదముట్ట గలవు. ఓరోరిదైత్యాధమా! అవ్యవస్థితము లగునీదుర్భాషలకుఁ బ్రత్యుత్తరంబు లొసంగనక్కఱ లేదు. ఏమంటివేని,

మ. చకితబ్రాహ్మణగోవధూనికరముల్ సమ్మోదముంబొందవై
దికకర్మంబులు సాగ నెప్పటి యటుల్; దివ్యుల్, ప్రహర్షింపఁగా
సకిరీటంబు సకుండలంబుసశిరస్త్రాణంబుగా నీదు మ
స్తకముం ధారుణిఁ గూల్చువాఁడ నిదె మచ్చక్రాహతిన్ దుర్మతీ!

దేవీ! చక్రమిటు దెమ్మ.

నర—ఓరిక్షత్రియకులాపశదా! ఏమి! సకిరీటంబు సకుండలంబు సశిరస్త్రాణంబుగా నాదుమస్తకమును గూల్చెదవా!

సీ. జవరాండ్రతోఁ గూడి సరసమాడుట గాదు మరలించుటకు నాలమంద గాదు
జున్ను మీఁగడ వెన్న జుర్రుకొనుట గాదు పడదన్నుటకుఁ జిన్న బండిగాదు
పాలీయవచ్చినపడఁతి జంపుట గాదు చితుకఁద్రొక్కఁగ నీటిచిలువగాదు
మతిలేకయుండిన మామఁగూల్చుటగాదు పెల్లగురుటకు ప్రేపల్లెగాదు
మా జరాసంధునకు నోడి మధుర విడిచి, నట్టనడిసముద్రంబున నగరుగట్టి
కాపురం బున్న జెట్టివి కావె నీవు, నన్నుఁ గూల్చువాఁడవు నీవె నందతనయ.

నీవు చక్రంబును ధరింపుచున్నాఁడవు గావున నే నిదె వింట బ్రహ్మాస్త్రముఁ దొడగుచున్నాఁడను.

క. మొక్కలము లేల పలికెదు
వెక్కలు; నరకాసురుండు విడువఁడు నిను నీ
వొక్కమ్మకు నొక్కయ్యకు
నిక్కముగా బుట్టితేని నిలుమీ యెదుటన్.

సూతుఁడా! రథము గోపాలున కభిముఖముగాఁ ద్రిప్పుము.

సూతు—దేవా! అట్లేచేయుచున్నాఁడను.

కృ—దారకా! రథము దానవుని కభిముఖముగాఁ ద్రిప్పుము.

దార—అయ్యప్రమేయుఁడా! అరదము వాని కభిముఖముగానే యున్నది.

[తెరలో]

నరకమహారాజా! శరణు! శరణు! ఈగరుత్మంతుఁడు మమ్ముం బ్రతుకనిచ్చుట లేదు. కుటిలనఖరాగ్రమ్ముల నెత్తుకకండలఁ బెకలించియు, జంచుపుటంబున మేమలఁ జీల్చియు బక్షాఘాతంబులం దూల్చియు నితఁడు దానవ సైన్యంబుల దైన్యంబు నొందించుచున్న వాఁడు. రక్షింపుము. రక్షింపుము.

నర—ఓదనుజులారా! వెఱవకుఁడు. వెఱవకుఁడు. ఇదిగో వచ్చుచున్నాఁడ. సూతుఁడా! రథము తోలుము.

సూతు—ఇదిగోఁ దోలుచున్నాఁడను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

దార—దేవా! ఈదురాత్ముఁ డీనెపము పెట్టి తప్పించుకొనిపోయినాఁడు.

కృ—వాఁడు పలాయితుఁ డయ్యెను మనము వానిని విడుతుమా.

దార—వీఁడు కర్ణకఠోరముగా నొనరించిన భగవద్దూషణమునకు తత్క్షణమే వధ్యుఁడు.

సత్య—దారకా! భగవంతుని దెలిసికొనుట కెంతవారు గావలయును.

శా. శ్రీరంజిల్లగ ముక్తినాయక మహాసీమంతినిం గూడి యోం
కారస్యందన మెక్కి స్వచ్ఛ మయి విజ్ఞానాత్మకం బైనగం
భీరాకారముతోడ నయ్యుపనిషద్వీధి న్నిరాఘాటసం
చారంబుం బొనరింపగానియెఱుఁగ శక్యంబె దైత్యాళికిన్.

దార—అమ్మా! నీమాట నిజము. ఈశ్వరు నెఱుఁగుటకు వీఁ డెంతవాఁడు.

కృ—దారకా! నరకునిమీఁది కరదమును సత్వరము తోలుము. ఇప్పుడే వానిని చక్రంబునఁ గెరఁ జేసెదను.

దార—చిత్తము. [అని తోలుచున్నాఁడు.]

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



# ప్రసన్నయాదవము

## పంచమాంకము

[అప్పు డేడ్చుచు వ్రజకంఠుఁ డను రాక్షసుఁడు ప్రవేశించును.]

వ్రజ—(తనలో) హా నరకమహారాజా! హా శ్రితజనకల్పద్రుమా! హా దనుజకుల పారిజాతమా! హా సుగుణరత్నాకర! దురాత్ముఁ డయినకృష్ణునిచే నిష్కారణముగా వధియింపఁబడితివా? అయ్యయ్యో! ఇంక మాకు దిక్కెవ్వరు? నీయండ నుండబట్టియే గదా దిక్పాలకులను స్వర్గమునుండి దొంగలనుదోలినట్లు తోలి కంటి కగపడిన దేవతల నందఱను జేతికిదొరకిన బడితెలతోఁ గుక్కలను కొట్టినట్లు కొట్టఁగలిగితిమి. నీసంరక్షణమున నుండఁబట్టియే గదా మేము గాదిక్రింది పందికొక్కులవలె నేవెలితియు లేక హాయిగా సుఖించితిమి. నీపేరు దివ్యులకు సింహస్వప్నముగదా? ఆమేలుదినములు పోయినవి. మందభాగ్యుల మగుమాకు నీవంటి యుత్తమోత్తముఁడు దొరకునా! ఇవి న్యాయమునకు దినములుగావు. అందుచేతనే స్వకులాభిమానులును ధర్మస్వరూపులును తేజోరాసులును నగుమీవంటివారు కడునీచులచేత మడియుటయు దుర్జనులును దుర్మార్గులును దుశ్శీలురు నగువేల్పులు జయించుటయు సంభవించుచున్నది. లోకములో నెందఱికైనను చావున్నది కాని యీపాడుముండకొడుకు కృష్ణునకుఁ జావులేదుగదా! మారక్కసుల నందఱఁ జంపినాఁడు. వారి యాయువుఁ బోసికొని చిరంజీవియై బ్రతుకుచున్నాఁడు. 'పాపీ చిరాయు' వన్నమాట వీనియందే సార్థకమగుచున్నది. ఈపాపాత్మునకుఁ బుఱిటిలో సందైనఁగొట్టదయ్యె. బాలపాపచిన్నెయైన రాదయ్యె. ఏరక్కసునిచేతంబడియైనఁ జావడయ్యె. ఏరోగములేక నాచిన్నప్పటినుండియు నీకృష్ణుఁడు రాయివలె నిల్చియున్నాఁడు. ఎంతోధైర్యవంతుఁడను నేనే యింత బెంగఁ గొనఁగా జేలలగు మందపాలుఁడు లోనగువా రెంత కడుపగిలి యున్నవారోకదా!

[అంతట పెద్దపెట్టున నేడ్చుచు మందపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మంద—(తనలో) హా రాక్షసరాజా! నీకెంతలోఁ గాలమాసన్నమైనది. నీవు లేకపోవుటచేఁ బాపాత్ములగు మునులు దేవతలుఁ జెలఁరేగి మాకొంపలు త్రవ్వుదురు గదా! ఇఁక మాకెవ్వరు దిక్కు. నే నేమి జేయుదును? చిన్నతనమునుండియు నన్నదమ్ముల లాగునఁ బెరిగితిమి? గనుక నేనును మావ్రజకంఠుఁడునుగలసి యేదో బ్రతుకుతెరువాలోచించికొనియెదము. ఇదిగో వాఁడిచ్చటనే యున్నాఁడు. (అని సమీపించును.)

వజ్ర—[ఏడ్చుచు మందపాలుని గౌఁగిలించుకొని మనమహారాజుగారిని కృష్ణుఁడు తనపాట్టను పెట్టుకున్నాఁడురా! అన్నయ్యా!

మం—మన మిప్పుడు దిక్కుమాలినవారమైనామురా! తమ్ముఁడా!

వజ్ర—ఎల్లప్పుడు నా పాముచేల్పులపంతమే నెగ్గుచున్నదిరా! అన్నయ్యా!

మం—మనకోట శనియుండఁగా మనపంత మెట్లు నెగ్గును! తమ్ముఁడా!

వజ్ర—మనుష్యులనెత్తురు గావలసినంత పానకము ద్రావినట్లు గుటగుటత్రాగెడు వారముగదా! అన్నయ్యా!

మంద—మొక్కజొన్నపొత్తులవలె నిర్భయముగాఁ గావలసినప్పుడు మనుష్యులను గాల్చుక తినెడివారముగదా? తమ్ముఁడా!

వజ్ర—ఆవైభవమే పోయిందిరా! అన్నయ్యా!

మంద—అప్పుడే పట్టణమంత పాడువారిందిరా. తమ్ముఁడా!

వజ్ర—ఇంతపని చేసినకృష్ణునిఁ గడతేర్చుటకు నుపాయమాలోచింపవలయును.

మంద—బుద్ధిమంతులము మనమిద్దఱముఁ దలచుకొన్న పక్షమున వాఁ డింక బ్రతుకఁగలఁడా?

వజ్ర—అట్లయిన కృష్ణు నేవిధమున మృతినొందింతము?

మంద్ర—నీవు త్రాఁచుపామువై వానిని గఱువుము.

వజ్ర—వెంటనే గరుత్మంతుఁడు నన్నుఁ జీల్చి చంపఁ గలడు.

మంద—అవునవును. అది వీలులేదు; పోనీ, పులివై వానిఁ గడతేర్పుము.

వజ్ర—అతఁడు నరసింహమూర్తి. అందుచేత నతఁడు పులిమీఁద పుట్టి.

మంద—నిజము నిజము. అది వలనుపడదు. పోనీ కొండనై నేను వానిమీఁదఁ బడుదునా?

వజ్ర—వాఁడు కొండ గుండఁజేయగలబండ. గోవర్ధనమెత్తలేదా?

మంద—నిశ్చయమే. ఈయుపాయములు బాగులేవు. ఈవొంగపోటులేల! కత్తి చేతఁబూని శూరులమై వాని కెదురుగఁబోయి వధియింతము. మృతినొందుదుమను భయములేదు. గుక్కెడుప్రాణము. ఎప్పుడుపోయినను పోవును.

వజ్ర—అవునవును. మహారాజుగారే మృతినొందగా మన మెంతవారము. ఈతుచ్ఛప్రాణములపై నాశ విడిచి స్వామిభక్తిని జూపుదము. రమ్ము. కత్తులఁ దెచ్చుకొందము.

మంద—ఉండుము. ఉండుము. ఎవరో వచ్చుచున్నారు.

వజ్ర—(చూచి) హా! చచ్చితిని. వాఁడు కృష్ణుని సారథి యగుదారకుఁడు.

[అంతట దారకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దార—(తనలో) భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు నన్నుం బిల్చి, దారకా! పితృవిహీనుఁ డగుభగదత్తుకుమారుని నే నిప్పుడు చూడవలయు. వానికి నారాక నెఱిఁగింపుమని యానతిచ్చె. అతఁ డెందున్నాఁడో తెలిసికొని యిప్పుడే సందేశ మెఱిఁగించెద.

మంద—ఓరీ! వజ్రకంఠా! నన మిప్పుడు పాఱిపోయినను వీఁడు చంపును. పాఱిపోక నిలిచినను వీఁడు చంపును. గతి యేమి?

వజ్ర—వానిమాట కెదు రాడకపోయినచో వాఁడు మనలఁ జంపఁడు.

దార—ఓయి! మీరెవరు? కుమారభగదత్తుఁ డెందున్నవాఁడు.

మంద—(గజగజవణఁకుచు) మేము నర-నర-నర-నర.

వజ్ర—(గద్గదస్వరముతో) మేము నరకుని బంట్లము కాము.

దార—మీరింత భయపడ నక్కఱలేదు. నేను మీజోలికి రాను. భగదత్తుని జాడఁ దెల్పుఁడు.

వజ్ర—అయ్యా! నరకాసురుఁడు పరమదురాత్ముఁడు, కడునీచుఁడు, నీతిహీనుఁడు నగుటచే మేమతని సేవించుటలేదు.

మంద—అయ్యా! భగవంతుఁడగు శ్రీకృష్ణునకు నరకుఁడు విరోధి యగుటచే వాని సేవించుట మానితిమి.

దార—(తనలో) ఈపిరికిముండకొడుకులు నాకు వెఱచి యిట్లనుచున్నారు. (ప్రకాశముగా) రాక్షసులకు సయితము నంతటి యసహ్యాము గలిగించు దుర్గుణము లతని యొద్ద నేమియున్నవి.

వజ్ర—ఒకటా, రెండా చెప్పనలవిగాదు. స్త్రీలఁ జెఱపట్టుట. మహర్షులబాధించుట, యాగములకు విఘ్నములు సేయుట, విష్ణుభక్తులను వధించుట మొదలగు పాతకముల నేకములు చేసెను.

మంద—ఆపాతకుని పేరు నన మిక్కడ తలపెట్టరాదు. కృష్ణుఁడు వానింజంపి లోకమునకు మేలుచేసెను. వాఁడు తప్పక చావవలసిన వాఁడే.

దార—మీప్రసంగములు చాలించి భగదత్తునిజాడ నెఱుఁగుదు రేని చెప్పుఁడు. లేనిచో మీదారిని మీరు పొండు.

వజ్ర—స్వామీ! నాకాజాడ తెలియదు. మాకు సెలవొసంగుఁడు. పోవుదుము. రారా! మందపాలా! [అని యిద్దఱు కొంచెము నడచి రహస్యముగా] గండము గడచి యివతల పడితిమి. త్వరగా పరుగెత్తుకపోవుదము రమ్ము. (అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

దార—(తనలో) నాకిప్పుడు భగదత్తునిజాడఁ దెలుపువా రెవ్వరు ? అదిగో నక్కడ యొకకంచుకి యగపడుచున్నాఁడు; వానినడిగెద. (ప్రకాశముగా) ఓయీ !

[తెరలో]

అయ్యా ! అతఁడు దుఃఖపరవశుఁడై తండ్రికళేబరము జూడఁగోరి పాలికలనికింబోవఁ నుద్యుక్తుడై యున్నాఁడు.

దార—(ఆలకించి) సరే ! నేనిప్పు డతనియొద్దకుఁ బోయి సందేశ మెఱిఁగింప నక్కఱలేదు. వాసుదేవుఁడే వానిని యుద్ధభూమిలోఁ గలసికొనఁగలఁడు.

(అని నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

---

[అప్పుడు యుద్ధభూమిలో మూర్ఛితుఁడైన భగదత్తుఁడును శంబర మంత్రియుఁ బ్రవేశించుచున్నారు.]

శంబ—(తనలో) పితృవియోగదుఃఖము దుస్సహమైనదే. ఈభగదత్తుడు తండ్రికళే బరము నొక్కసారి చూచి మూర్ఛితుఁడై యింకను స్మృతినొందకున్నాఁడు. దైవానుగ్ర హమున వీనికిఁ దెలివి వచ్చునేని వీనిని దండ్రికళేబరమువద్దకు మరలఁ బోనీయఁగూడఁదు.

తే. గీ. భూరిసంతాప మెదఁ బొంగి పొరలునపుడు
చల్లఁదనమును వెదచల్లుసంగడీల
యూఱడింపుబల్కులు పాచు నుమ్మలంబు
పాలపొంగును చన్నీరు బాపునట్టు.

భగ—(మూర్ఛనుండి లేచి) హా! తండ్రీ! జగత్త్రయైకవీరా! తృణీకృతపురందరాది ప్పాలకా !

ఉ. తోలితి వాలమందలను దోలినపోలిక వేల్పుమూఁక, ది
క్పాలురద్వారపాలకులుగా నొనరించితి కోటకొమ్మలన్
ప్రేలఁగఁ గట్టినాఁడ వరివీరశిరంబుల, నట్టినీవు గో
పాలునిపాలు గావలసి వచ్చెనె యీశ్వరమాయ నక్కటా !

క. తలిదండ్రులకుం దమతన
యులపైగల యంగకూర్మి యుండదు తలిదం
డ్రులపై బిడ్డల కనియెడి
పలు కిప్పుడు నాకు నిక్కువంబై తోఁచున్

అందుచేత నేగదా నేను నిన్ననుసరింపలేకపోయితిని.

శంబర—(సమీపించి) కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

భగద—అయ్యా! శంబరమంత్రీ! ఇది నేను స్వయముగాఁ దెచ్చుకొనినదికాదు. అందుచేత నేనడఁపఁజాల. అయిన నిటు వినుము.

సీ. ఎవని మెప్పును బొంద నేవేళ పవనుండు వెచ్చనిగాడ్పులు వీవ వెఱచు
నెవనియల్కకు నోడి యెన్నండు భానుండు గట్టిగా నెండలు గాయ వెఱచు
నెవనియానతిలేక యెపుడు పర్జన్యుండు గొప్పగావానలు గురియ వెఱచు
నెవనిదాడికి నోడి యేప్రొద్దు మధువైరి కుదురుగా కనుమూసి కునుక వెఱచు
నెవని పేర్విన్నమాత్రాన ధృతిఁ దొలంగి
దిగ్గజంబులు స్వేచ్ఛమై తిరుగ వెఱచు
నట్టిజగదేకవీరుఁ బోగొట్టుకొంటి
నింక నూఱట గల్గుట యెట్లు నాకు.

శంబర—నీతండ్రి నిజముగా నీవన్నట్లు నిరుపమానతేజోరాశి. విచారించిన కార్యము లేదని నేనిట్లు నీకుపదేశించితినిగాని నీకుఁగల దుఃఖము నే నెఱుంగనా? సేవకుల మయినమేమే యెంతో మఱుఁగుచుండఁగా గారాబుకొడుకు వయినీ వెంతదురపిల్లు చుందునో చెప్పవలయునా? కావున నిప్పుడు కార్యగతులఁ బరిశీలించి వర్తింపుము.

భగద—అయ్యా! ఈసమయమునందు.

తే. గీ. ధైర్యశాలి కున్నవి రెండు కార్యగతులు
జనకుఁ దెగటార్చుపగతునిఁ జంపుటొండె
సమరముఖమునఁ దానైనఁ జచ్చుటొండె
కానఁబడ దింక నా కన్యకార్యసరణి.

శంబర—కుమారా! అది గాదు. తండ్రి కగ్నిసంస్కారంబు చేసి యుత్తరక్రియలఁ జేయుటయే కార్యపద్ధతి.

భగద—హా తండ్రీ! భువనైకమల్లా! నీవిషయమున నిట్టి దారుణవచనంబు విననలసె.

మ. అపచారం బొనరింప నెన్నఁడును నే నాబాల్యము న్నీకు నే
యుపచారంబును నీవు నావలన మున్నొక్కప్పుడుం గోరవై
తిపు డీకీతిని గోరఁగా దగునె తండ్రీ! యగ్నిసంస్కారమే
యుపచారంబగువేళ వచ్చెనదె యమోఘ నాదునిర్భాగ్యతేజ. (మూర్ఛిల్లును.)

శంబర—కుమారా! ఏమి యీబేలతనము. (తనలో) ఈతఁడు మాటిమాటికి మూర్ఛిల్లుచున్నాఁడు. ఇతనికి దుఃఖోపశమన మెట్లగును చెపుమా? శుక్రశిష్యుల కెంతదుఃవస్థ సంభవించినది.

[అప్పుడు రాక్షసగురు వగుశుక్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శుక్రు—(తనలో) అసురులు వేల్పులకన్న నెక్కుడు తేజోదర్పితు లయినను వారి యైశ్వర్యము వినశ్వర మగుటకుఁ గారణ మేమి? (కొంచె మాలోచించి) కారణ మునకయి వెదుకనక్కరలేదు.

మ. సిరి యెల్లప్పుడు ధర్మమూల మను మం జెప్పంగ విధుల్ ధర్మత
త్పరుఁడౌ నాతనిభూరివై భవము నిత్యంబై ప్రవర్తిల్లు, దు
ష్కరుఁడై ధర్మము వీడు మానవు మహైశ్వర్యంబు లీభూమికిం
బరువై గట్టిపునాది లేనియిలులేవం గూలు నొక్కుమ్మడిన్.

దానవులు ధర్మేతరమార్గవర్తను లగుటచే వారికడ సిరి యుండదు. ఎట్లయినను వారు మాకుఁ బ్రియశిష్యులగుటచే వాత్సల్యంబు పెంపున మేము వారిని సమాదరింపకతప్పదు. ఇప్పుడు పితృశోకదుఃఖితుఁ డగుభగదత్తకుమారుని సమాశ్వాసింపవలయు.

భగద—(స్మృతిఁ దెచ్చుకొని) తండ్రీ! నీవు లేమి జగమంతయు నంధకారమయ మయి యున్నయది. ఏలయన,

తే. గీ. పృథివి యంతయు నేఁడు నిర్వీర్యమయ్యె
రాజకుల మెల్ల నేఁడు నిస్తేజమయ్యె
దితిజవంశంబు నేఁడు నిర్గతిక మయ్యె
నీవు లేనివెలితి ధాత్రి కెట్లు దీరు?

శంబర—కుమారా! ఇదే నీ నిమిత్తము భగవాను లగుభార్గవులు వచ్చియున్నారు. అభివాదనముచేసి సదాచారము నడుపుము.

శుక్రు—కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

భగద—(కన్నీళ్ళతో) భార్గవా!

మ. కదనోద్ధూతబిడౌజుఁ డాసురవధూకళ్యాణసంపాది, యు
న్మదరాజన్యశిరోవతంసవిలసత్పాదారవిందుండు, కో
విదుఁ డసన్మజ్జనకుండు మీహితుఁడు మీబిడ్డండు మీశిష్యుఁ డ
ల్లదె నేలంబడియున్నవాఁడు హతుఁడై యాచార్య! కన్గొంటివే?

శుక్రు—వత్సా! మృతు లయినవారిని మనము దుఃఖించి క్రిమ్మఱ బ్రతికింపఁ జాలము. చిరసంబంధముచే నెంత యోఁచుకొన్నను దుఃఖాతిశయముచేత నేనును కన్నీరు విడువక తప్పినదికాదు. తలఁచుకొనినకొలది దుఃఖము పొరలిపొరలి వచ్చుచునే యుండును; కావున నీవింక నీతండ్రిని మఱవవలయు.

భగద—అయ్యా! వేదాంతవిద్యారహస్యజ్ఞాతు లగుమీరే దుఃఖమున కప్పు డిప్పుడు వశులగుచుండ నింక మాదృశులా దుఃఖసాగరము నీఁదువారు!

చ. మఱవఁదలంతు నాయెడల మజ్జనకుం డొనరించు కార్యముల్
మఱవఁదలంతు వానియసమానగుణంబుల నెల్లఁ గాని యా
నెఱతన మాజగద్వినుత నిష్ఠురవిక్రమ మా సుమూర్తియున్
మఱవఁదలంచినన్ మఱవ నాతరమా నిమిషార్ధమేనియున్.

శుక్రు—ధైర్యసాగరుఁ డగునరకునకుఁ దనయుఁడ వయిన నీవిట్లనఁ దగదు.

భగద—అయ్యో! ఇప్పు డేమి చూచుకొని నేను బ్రదుకుదును?

శుక్రు—కుమారా! ఏమియు లేనేలేదా?

తే. గీ. తల్లి గలదు రాజ్యరమాతల్లి గలదు
ప్రజలు గలరు నీకుఁ గన్నప్రజలు గలరు
పడుచువాఁడవు నీ కేమి బ్రతుక కేమి
చన్నవారితోఁ బోదురే యున్నవారు.

భగద—అవి యుండుట నే నెఱుంగుదును.

ఉ. ఉన్నవి వాజివారణము లున్నవి సంపద లెన్నియేని నా
కున్నవి నందనోపమమహోపవనంబులు పెక్కులేలగా
నున్నవి యూళులెన్నయిన నున్నవి సైన్యము లెన్ని యున్న నే
మన్నరకుండు లేమి నవి యన్నియు లేనటు తోఁచు భార్గవా!

శుక్రు—వత్సా! అట్లయిన నీయుద్యమ మేమి?

భగద—వీరపురుషుల యుద్యమమే నాయుద్యమము.

శంబ—ఈయుద్యమ మనుచిత మయినది.

శుక్రు—ఏమి? నీవు హరితోఁ గయ్యమునకు సన్నద్ధుఁడవయ్యెదవా? రు

భగద—ఆచార్య! మఱేమి!

ఉ. అంతటివానికిం గొడుకునై, ప్రియశిష్యుఁడనై ధరిత్రి మీ
యంతటివానికిన్, బ్రభువునై దితిసంతతి కెల్ల, నిన్ని నా
ళ్లింతయశంబుతో నడరి యీసమయంబున బందనాచు నే
నంతము సేయకుంట తగవా నరకాంతకు నమ్మురాంతకున్.

శుక్రు—ఓయీ! వెఱ్ఱివాఁడా! నీతండ్రికిని నీతండ్రిం దలఁ దన్నిన మొక్కలంపురక్కసులకును నలవిగాని యీపని నీకు సాధ్యమగునా?

క. ఏమనుకొంటివో నీమది
సామాన్యుఁడు గాఁడు చక్రి సమరంబున నీ

చే మర్దింపంబడుటకు
నామాటలు వినుము సంధి నడుపుము వత్సా.

శంబర—(శుక్రునితో మెల్లఁగా) దేవా! ఈయుద్యమ మెట్లయినమాన్పి దనుజకుల మనుగ్రహింపుము.

శుక్రు—కుమారా! కృష్ణుని ప్రభావము వినఁగోరుదు వేని నే నించుక ప్రశంసించెద వినుము. అతఁడు మహీభారావతరణార్థమై యదుకులంబున నవతరించిన హరిగాని మనుజుఁడు గాఁడు. అందుచే నితఁడు,

సీ. పసితనంబున నేలఁ ప్రాక నేర్చిననాఁడె పగరకోటల కెగఁ బ్రాక నేర్చెఁ
దిన్నఁగా నొక్క విద్దెయును నేరనినాఁడె దితిజులఁ జంపువిద్దెమును నేర్చె
నిల తప్పటడుగులు నిడుట నేరకమున్నె వెసతప్పటడుగులు వెట్ట నేర్చె
నుయ్యాలలం దుండి యుగ్గు ద్రాగెడునాఁడె క్రిగ్గాడియసురుల నుగ్గుచేసెఁ
బాలు గుడుచునప్పుడె నేలపాలు చేసెఁ, బ్రబలదైత్యులఁ బలువురబలము మెఱయ
నతఁడు మాపినకులము లెన్నైననఁ గలవు, వలదువల దన్న హరితోడఁ బగలు మనకు.

వెండియు నితఁడు మాయలఁ బ్రయోగించుటయందు నేఱకాఁడు.

శంబర—అవును. వైష్ణవం బైనమాయ దుస్తరమని వినుచుందుము.

భగద—పగతుల సాధించుట కితఁడు మాయలనే ప్రయోగించునా?

శుక్రు—వత్సా! మఱేమి? చూడు.

మ. కెడపెఁ గంసుని, జంపె హంసుని, దృటిం గెల్చెన్ జరాసంధునిన్;
బొడిచెన్ బౌండ్రకుఁ, గూల్చె గాలయవనున్, బోకార్చెఁ జేదీశుఁ, జ
క్కడఁచెన్ బూతన వీరి నందఱను మాయల్ పన్నియే చక్రి రూ
పడఁచెన్ గాని, పరాక్రమస్ఫురణచే నంతంబు నొందించెనే.

అవి యన్నియు నేల? నాస్వవిషయమున నే నించుక చెప్పెద వినుము. తొల్లి యతఁడు మహేంద్రరక్షణము చేయ నదితికశ్యపులకు వామనుఁ డయి జనియించి దీనచింతామణి యగు బలిచక్రవర్తియొద్దకు నిఱుపేదయట్లు వచ్చి మూఁడడుగుల నేల యాచించె. అప్పుడు నేను,

ఉ. కైటభదైత్యమర్దనుఁడు గాని యితం డొక యర్థిగాఁడు మో
మోటముచేత నీవలదు మూఁడడుగు ల్దరయంచుఁ జెప్పుడున్
గాటపుటల్కదర్భఁగొని నన్పొడిచెన్ గను లొట్టవోవఁగా
నాఁటికి నేటికిం దనయ! నాకుడికన్నె టులుండెఁ జూడుమా!

భగద—ఆచార్యా! మీరు చెప్పినదంతయు సహేతుకముగా నున్నయది. అట్లయిన నాకిప్పుడు కర్తవ్యమేమి?

శుక్రు—ఇదిగో యుపదేశించుచున్నాఁడ వినుము.

మ. అభిమానమ్మును జంపుకొమ్ము, సమరవ్యాపారము న్మానుకొ
మ్మభయం బిమ్మని నందనందనుని పాదాంభోజము ల్వేఁడికొ
మ్మభిషేకమ్మును జేసికొ మ్మవనికి న్యాయంబుగా నేలుకొ
మ్మభువిం బిమ్మటఁ జూచుకొమ్ము సిరియెప్డు న్నీకు నెట్లబ్బునో.

శంబ—ఇదియే కర్తవ్యము.

క. అమరుల కాంగిరసుం డెటు
లమరారాతులకు శుక్రుఁ డట్టులె కాన
సమయోచితంబులగు నీ
విమలోక్తుల నవధరించి వినుము కుమారా.

భగద—భగవానుఁడా! ఓభార్గవా! నీయుపదేశము మా కాదేశముగదా! నే నట్లేచేయుదును. కాని పితృమరణమునకుఁ బ్రతిక్రియఁ జేయుట యెప్పుడు?

శుక్రు—సమయ మగునప్పుడు.

తే. గీ. మానసంబున రవులు క్రోధానలంబుఁ
గానఁబడకుండ దిగ్రమింగి కార్యవాది
సమయ మగునప్పు చెలరేఁగి జగము లదలఁ
బైటఁ బడఁదగు నగ్నిపర్వతమువోలె.

భగద—ఆచార్యా! మేలు. మీమాట శిరసావహించితి. శంబరా! నీవుపోయి యీ జనకునియుత్తరక్రియలవిషయమునఁ బ్రయత్నముసేయుము. నే నిప్పుడె కృష్ణునిఁజూచి వచ్చెదను. బ

శంబ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాడు.)

[అప్పుడు శ్రీకృష్ణుఁడు సత్యభామయుఁ బ్రవేశించుచున్నారు.]

కృ—దేవీ! చిన్ననాఁడు నేను సాందీపునియొద్ద విద్యఁ గఱచు నెడ నొక చిన్న పద్యముఁ జదివితి. దానియాథార్థ్య మిప్పు డెఱింగితిని.

సత్య—అది యేదో యెఱింగించి నాకు వీనులవిందు సేయుదురా?

కృ—సందేహ మేమి, ఇదిగో విను.

క. ఘనుఁడైన నల్పుఁడైనను
జననింద్యుండైన లోకసమ్మతుఁడైనన్

ధనియైనఁ బేద యైనను
దనతండ్రియె మంచివాఁడు తనయున కెపుడున్.

సత్య—దానియాధార్థ్య మెట్లెఱింగితిరి ?

కృ—జగత్కంటకుఁ డగుతండ్రికొఱకు భగదత్తుఁడు మిక్కిలి విలపించుటచే దానిసత్య మెఱింగితి. ఇప్పుడు పితృశోకవిహ్వలుఁ డగుభగదత్తుని సమాశ్వాసింపవలయు.

సత్య—దేవా ! తండ్రిని జంపి కొడుకు నెట్లూఱడింపఁ గలరు. మీకు మోమోటము లేదా ?

కృ—సుందరీ! రాజనీతి మోమోటము నెఱుంగదు, తొల్లి రాఘవుఁడు వాలిం గడతేర్చి యంగదుని యౌవరాజ్యమున కభిషిక్తునిఁ జేసి వానికి సేవ్యుండు గాలేదే. అది యటుండనిచ్చి యిటువినుము.

మ. ఖలునిన్ మాగధుఁ ద్రుంచి తత్తనయునిం గద్దెం బ్రతిష్ఠించితిన్
గులువం గంసునిఁ జంపి నిల్పితిని బంధుల్ మెచ్చ మాతామహున్
బలుగాకి న్నరకు న్వధించితిని గానం బోత్రుఁ దత్పుత్రునిన్
దలిరుంబోఁడిరో ! రాచపాడి యిది క్రొత్తల్గావు మాకీపనుల్.

అదిగో శుక్రాచార్యసమేతుఁడై భగదత్తుఁ డచ్చట నున్నాఁడు.

సత్య—పేరు వినుటయే గాని భార్గవుల నెన్నఁడును దర్శింపలేదు.

కృ—దేవీ ! ఇతఁ డసురగురుఁడైనను మహామహిమగలవాఁడు. వందనీయుఁడు.

(ఇద్దఱు నడచుచున్నారు.)

శుక్ర—కుమారా ! దేవీసమేతుఁడై వాసుదేవుఁ డిటు వచ్చుచున్నాఁడు. అభివాదనము చేసి శరణ మడుగుము.

భగ—చిత్తము. రండు. వారి నెదుర్కొందము.

శుక్ర—జయతు జయతు దేవకీనందన !

కృ—భార్గవుల కభివాదనము సేయుచున్న వాఁడ.

శుక్ర—అనంతకల్యాణమస్తు. యదుకుంజరా ! నీకతమున పితృవిహీనుఁ డగు నీ బాలకుఁడు నీకు రక్షణీయుఁడు. వత్సా ! భగదత్తా ! ఇదె నిన్ననుగ్రహించుటకు భగవంతుఁడు వచ్చియున్నవాఁడు. శరణము వేఁడుము.

కృ—అపరాధి వధింపఁబడియె. ఇతఁడు మా కవశ్యము రక్షణీయుఁడు.

భగ—(చేతులు జోడించి) దేవా ! నందనందనా !

సీ. తమ్మిచూలినిఁగన్న తండ్రిపమ్మ్యు యశోదయొడిలోన బిడ్డఁడై యున్నవాఁడ
తెలిపీవిపై బాళి దొఁగడి వ్రేపల్లెలో మందగాపరి వాచు మన్నవాఁడ

ప్రేవెలందులయిండ్లు వేమారు కొల్లాడి వెన్న మ్రింగడఁ జాల తిన్నవాఁడ
తలఁపుల నెక్కించి వలపుల సుక్కించి గొల్లకన్నెలసిగ్గుఁ గొన్నవాఁడ
కమ్మవిలుకాని గడుపారఁ గన్నవాఁడ, వేఁడువారి నేలుదు వంచు విన్నవాఁడ
నన్నుఁ బ్రోవుము నీవాఁడ నన్నవాఁడ, చిన్నవాఁడనో నందుని చిన్నవాఁడ.

(అని కాళ్ళపైఁ బడుచున్నాఁడు.)

కృ—కుమారా! లేలెమ్మ. (అని లేవనెత్తి.)

మ. అలుకం బూనకుమయ్య నాపయిని నీయాత్మకుఁ రవం తేనియున్
దలకుం దాల్పకు మయ్య నేఁ బగతుఁడం గానయ్య నీకియ్యెడన్
ఖలుఁడై నీజనకుండు ముజ్జగములం గారించుటం జంపఁగా
వలసె న్వానిని సేయఁగావలసె దుర్వ్యాపారంభముల్ నీయెడన్.

భగద—దేవా! ఇందు నీ తప్పేమున్నది? నీకుం బగతుఁడై మాతండ్రి స్వయముగా నింత తెచ్చుకొనియె.

కృ—ఓయీ! వెఱ్ఱివాఁడా! నాకుఁగాదు. లోకమునకుఁ బగతుఁడై యనుము.

శా. నాకుం జుట్టమనంగ దాయయన నున్నాఁడే ప్రపంచంబునన్
లోకద్రోహులు మాకుద్రోహులు సుమీ లోకప్రియుల్ మాప్రియుల్
శ్రీకృష్ణుం డవతారమెత్తెను జగత్ క్షేమంకరోత్సాహియై
మీకు న్మీకును గీడు సేయుటకు జన్మింపంగ లే దిద్ధరన్.

శుక్ర—దేవా! నీకు జుట్టమును బగతురు లేనిమాట నిజమే; కాని నరకుఁడు మీకుఁ జుట్టమును బగతుఁడుఁ గూడ నయ్యె.

సత్య—భార్గవులు లెస్సగా సెలవిచ్చినారు. ఈమహాత్మునకు నరకుఁడు భూమి దేవివలనఁ గొడు కగుటచేఁ జుట్టము. ధర్మద్వేషి యగుటచే వైరి.

కృ—అది నిజమే. కుమారుఁ డయినను దుష్టుఁ డగుటచే వాత్సల్యము ద్రోసి వాని వధించితిమి.

శుక్ర—ఎట్లయినను నరకుఁడు మీచే హతుఁడై ముక్తుఁడయ్యె.

భగద—నాతండ్రి హరిచేత ముక్తుఁడయ్యెనని నాకిప్పుడు కొంతదుఃఖ ముపశమిల్లినది.

కృ—వత్సా! భగదత్తా! నీవు లోకానుభవమున కపరిచితుఁడవు గాన నన్యథా భావింపవేని నే నించుక యుపదేశింపఁ దలఁచుచున్నాఁడను.

శుక్ర—ఇది వాని ననుగ్రహించుట.

భగద—ఇందు నే నన్యథా తలఁపవలసిన దేమున్నది?

కృ—నరుఁ డెంత తేజశ్శాలియైనను గుణహీనుఁ డయినచో నభ్యుదయము నొం దఁడు. దానికి నీతండ్రియే తార్కాణము.

శా. ఆతేజంబున కాబలంబునకుఁ దోడై నీతియే యుండె నా
నీతండ్రంతటివాఁడు ముజ్జగముల న్నిక్కంబుగా లేఁడు నూ
నీతిభ్రష్టుఁడు గాన నిట్లు చెడియె న్నీతండ్రి నీవు న్సరా
రాతు ల్మోయిన పోకఁబోక గుణివై ప్రాగ్జ్యోతిషం బేలుమా.

శుక్రు—కుమారా! ఈయుపదేశము నీ కనుసరణీయమయినది.

భగద—ఇది నేను శిరసావహించుచున్నాఁడను.

కృ—ఇంకను నీ కుపదేశింపఁదగినవి రెండు గలవు. మహానుభావు లగుతపోధను లయెడ వినయవృత్తి నెఱపుము. పరకాంతలయందు మాతృభావము నిలుపుము. వీనియందు ధర్మవిరుద్ధముగా వర్తించుట స్వనాశమును దెచ్చుకొనుటయె.

సీ. ఋషికి నెగ్గొనరించి వృషలుఁడై జనియించె నవనిలో నసవర్తి యంతవాఁడు
మునులచేఁ బల్లకి మోయించి యజగరంబై పడె నహుషునియంతవాఁడు
జడదారి కోకకీడు సలిపియే శాపోపహతుఁ డయ్యె నమరేంద్రునంతవాఁడు
బ్రహ్మర్షియల్కకుఁ బాత్రుఁడై నాఁ డట్టు లడఁగెం బెవింధ్యునియంతవాఁడు
కాంతకై చెడె రావణునంతవాఁడు, అతివకై చెడె మీతండ్రియంతవాఁడు
యెవఁడు సుఖియించెఁ బరకాంతి గవయఁగోరి, యెవఁడు వర్ధిల్లె ఋషులకు నెగ్గు చేసి.

మఱియు నిన్నొకధర్మకార్యమునకు నియోగింపఁదలఁతు. అది యేదందువేని,

తే. గీ. తల్లిదండ్రుల కడబాపి తెచ్చినాలి
పదియునాఱ్వేలకన్నెలఁ బట్టి తెచ్చి
చెఱల బంధించె మీతండ్రి చనటె యగుచు,
విడిచిపుచ్చుము వారి వేవేఁ నిపుడు.

శుక్రు—అవును. నరకునిపాలిఁటి మృత్యుదేవతలో యనునట్లు లాకన్యలు దుఃఖ విహ్వలమతులయి యున్నవారు. తత్క్షణము వారిని విడువుము.

భగద—ఇదిగో నిప్పుడే నేనుపోయి వారిని విడిపించెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

సత్య—దేవా! అనాథ లగునా రాజకన్యలను విపత్సముద్రమునుండి యుద్ధరించి మీరు పుణ్యముఁ గట్టుకొనిరి. మీమేలు వారెన్నఁడు మఱవరని తలంచెద.

కృ—సుందరీ! నే ననాథలకు నాథుఁడను. అగతికలకు గతినిగద.

సత్య—అందుచేతనే దేవతలు, మహాత్ములు మిమ్మాశ్రయించిరి.

శక్ర—(ఆశ్చర్యముతో) ఎవరో యంతరిక్షమునుండి దిగి యిటువచ్చుచున్నారు!

కృ—(చూచి) మహేంద్రసఖుఁ డగుచిత్రరథుఁడను గంధర్వుఁడు.

సత్య—ఈవిజయమునుగూర్చి మిమ్ము బహూకరించుటకు మహేంద్రుఁ డతనినిఁ బంపియుండును.

శక్ర—అదిగో బృహదశ్వమహాముని యిటు వచ్చుచున్నాఁడు.

సత్య—ఇతఁడు తన్నిమిత్తముననే యిటు వచ్చియుండును.

[అప్పుడు చిత్రరథుఁడు బృహదశ్వుఁడు ప్రవేశించుచున్నారు.]

చిత్ర—బృహ—విజయతాం విజయతాం దానవగజేంద్రపంచానన!

కృ—గంధర్వరాజునకు స్వాగతము. మహర్షి కభివాదనము.

శక్ర—బృహదశ్వా! బదరికాశ్రమవాసులకుఁ గుశలమా! చిత్రరథా! దివ్యుల కభ్యుదయమా!

చిత్ర—బృహ—ఇప్పు డభ్యుదయమే.

కృ—మీరాకచేత ధన్యుఁడ నయితిని.

చిత్ర—దేవా! మహేంద్రుఁడు మీరొనర్చిన యుపకారమునకుఁ గృతజ్ఞుఁడయి తనభక్తిని మీకు విన్నవింపు మని నన్నుం బనిచె. ఇదిగో నాతనిమాటలు వినుఁడు.

క. అనుజుఁడవై యొకమారా
దనుజుభయం బుడిపి యొక్కఁదరిఁ జేర్చితి నా
మనుజుఁడవై యిప్పుడు దితి
తనుజుల నదించి నన్ను దయఁ జూచితివో.

కృష్ణ—ఎంతమాట. మహేంద్రునకు నేనా యుపకారము చేయఁగలవాఁడను. ఈజయమునకుఁ గారణము మహేంద్రప్రభావమే.

తే. గీ. అన్న సన్నద్ధుఁడై పోరకున్న నేమి
తమ్ముఁగుఱ్ఱయె గెల్చెఁ గా దనుజతతిని
మాపుల నినుండు లేఁ డన్నమాటె గాని
చంద్రకాంతియు నతనితేజంబు కాదె?

చిత్ర—ఇది కేవల వినయోక్తి.

బృహ—దేవా! బదరికాశ్రమతాపసులు తమభక్తి విన్నవింపుమని నన్ను మీవద్దకుఁ బుత్తెంచిరి.

మ. శ్రవణానందముగా వినంబడియెఁ జూరమ్మన్య గర్వాంధు డై
త్యవిభు న్నీ విటఁ జంపినశుభవార్త ల్తాపసశ్రేణిచే

భువనంబు ల్పదునాలుగుం బడసె సంపూర్ణప్రమోదంబు నీ
భువి నీరాక్షస మయ్యె నీకరుణ నుత్ఫుల్లాంబుజాతేక్షణా !

* కృష్ణ—దివ్యులయు మహర్షులయు ననుగ్రహముచే నిప్పుడు విజయలక్ష్మిసమేతుఁడనయితిని.

బృహ—ఇప్పుడుగాదు. ఈవిజయలక్ష్మిని నీవు ద్వారకనుండియే వెంటఁదెచ్చితివి.

చిత్ర—అవునవును.

క. ఇత్తలిరుఁబోఁడిచేఁ గ్రొ
న్నెత్తురులను ద్రావునట్టి నీచదనుజులన్
మొత్తించుట మెత్తనిపువు
గుత్తులతో రాళ్ళు పగులఁగొట్టించుటఁజూ !

బృహ—దివ్యమనుష్యాంగనలలో నెవ్వరు నీమెకు సవతు రారు.

శుక్ర—లావణ్యముండుచోట పరాక్రమ ముండుట యరిది.

[అప్పుడు భగదత్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భగద—దేవా ! మాతండ్రిచేత బంధింపఁబడినరాజకన్యకల విడిపించితిని. వారందఱు రమానాథుఁడు జగన్నాథుఁడే మాకు నాథుఁ డని మిమ్ముం బరిణయ మగుటకుఁ గోరుచున్నారు.

చిత్ర—ఇది మీరు నిరాకరింపఁదగినది గాదు.

బృహ—జగత్కల్యాణకరునకుఁ గల్యాణము లగుట వింతగాదు.

శుక్ర—ఆకన్య లనుగ్రహింపఁబడుదురు గాక !

కృష్ణ—ఇందు నేను మధ్యస్థుఁడను. సత్యభామయే దానిని నిర్ణయింపవలయును.

సత్య—భరియించువారు మీరుండఁగ నేను నిర్ణయింపవలసినదేమి ?

కృష్ణ—సవతులతో వేగవలసినదానవు నీవు.

సత్య—ఇందఱుభార్యలతో మీరు వేఁగగా సవతులతో నే వేఁగజాలనా ?

కృష్ణ—భగదత్తుఁడా ! మహర్షిసమక్షమున నందఱ నేను బరిగ్రహించితి.

చిత్ర—దేవా ! పోవుటకు మాకింక ననుజ్ఞ యిమ్ము.

మ. అవతారంబుల నెత్తి భూభరముఁద్రోయ న్మీనమై కూర్మమై
సువరాహం బయి నారసింహ మయి గుజ్జుం బ్రోడనై మీఁద భా
ర్గవుఁడై రాఘవుఁడై యదుప్రవరుఁడై కల్యాణము ల్గూర్చి యా
దివిజానీకము గాచు వైష్ణవమహాతేజంబు మమ్మేలుతన్.

బృహ—దేవా ! నిన్ను నేను గొనియాడఁజాలను; కాని

సీ. ప్రామిన్కుటువిదల సీమంతమణిఁ గొంచు నలరారు నెవ్వాని యడుగుదోయి
బ్రహ్మాండగృహమందు రత్నంపుదివ్వెలై కడువెల్గు నెవ్వానికన్నుదోయి
శ్రితజనంబుల కెల్లఁ జేయూఁతకోలలై క్రాలెడు నెవ్వానికేలుదోయి
దుష్టనాశము దెల్పు ధూమకేతువు గొంచు మడిపడు నెవ్వానిబొమ్మదోయి
యట్టిజగదేక గురునకు నచ్యుతునకు, నాదిమధ్యాంతరహితున కవ్యయునకు
విశ్వమోహనునకు మహావీరునకును, జ్ఞానమయునకు నంజలి నేనొనర్తు.

కృష్ణ—దేవతలయు మహర్షులయు నీప్సితములు సిద్ధించుఁ గాక!

బృహ—జగముల కదివఱకే యనంతకల్యాణములైనవి. వెండియు నిట్లగుఁగాక!

చ. నెలకును మూడువాన లవనిం గురియందగు బంటలెచ్చ రా
జులు ప్రజలం బలెం బ్రజలఁ జూచుకొనం దగుఁ బ్రేమమీఱ నీ
వలెఁ దలిదండ్రు లింక దలవంపులఁ దెచ్చెడు చెడ్డబిడ్డలన్
దెలుపని శిక్ష జేయఁదగుఁ బ్రేముఁ దొరసి ప్రసన్నయాదవా!

కృష్ణ—తథాస్తు. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

సమాప్తము.



# బలిబంధనము

(గ్రంథకర్త:—చందాల కేశవదాసుగారు.)

ఆంధ్రరంగస్థలములకు చిరపరిచితమైన కనకతారానాటకరచనమున ఖ్యాతిగాంచినది ఈ కవిచంద్రుఁడే!—శ్రీ మహావిష్ణుదేవుని పంచమావతారమగు వామనచరిత్రమే ఇందలి యితివృత్తము! దానవీరులలో నొక్కఁడగు బలిని, రసాతలమున స్థాపించిన భక్తి వీరరససమ్మేళనమగు ప్రఖ్యాతపురాణకథానకము! దేవదానవుల సహజవిరోధభావములు—బలిదానవేంద్రుని ప్రతాపవిజృంభణము—పరంధాముని భక్తవాత్సల్యము—అను గుణగుణములు రసపూరితములుగా, చిత్రింపబడినవి. ముండకావాల హాస్యకథ మూలకథతో నతుకబడి రంగరంగమధ్యమునను రంగులీనుచు, హాస్యరసమును పూర్తిచేయుచున్నది. అసాధారణభావకల్పనములతో అక్షరలక్షలుచేయు పద్యములతో—అత్యద్భుతమగు కథాకల్పనముతో—అఖిలజనానందదాయకమగు, సపూర్వవేదాంత తర్కవితర్కములతో—ప్రఖ్యాతిగాంచిన బలిబంధన మహాఘట్టముతో—విభ్రాంతిని గలిగించు వామనావతార విశ్వరూపప్రదర్శనముతో—కథావస్తువు, గంభీరముగ కడముట్టినది. ఒకవంక నటశేఖరులకు, ఒకవంక గాయకలోకమునకు, ఒకవంక భక్తకోటికి, ఒకవంక వేదాంతులకు, ఒకవంక హాస్యరసప్రియులకు, ఒకవంక అధునాతనభావాభిలాషులకు, మనోరంజకముగ, మహాసమగ్రతతో రచింపబడిన ఈ నూతననాటకమునకు విలువ నిర్ణయించుట యసాధ్యమైనను, సర్వజనులకును సాధ్యముగ నుండుటకై—స్వల్పమూల్యము నిర్ణయింపఁబడినది.

వెల 1—0—0.

---

# కాలకేతనము.

(గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు.)

కథానాయకుఁడగు కాలకేతనుఁడు మహాభయంకర స్వభావుఁడై - నిరంతర హత్యాదాహముచే, ప్రకృతిభీకరుఁడై - యొనరించినహత్యలసంఖ్యాకములు. కాలకేతనునివంటి భయంకరవ్యక్తి మన ఆంధ్రనాటకములలో నింతవఱకున్ను చిత్రింపఁబడి యుండలేదు. ప్రసవమునందే యుసురుదీసిన మాపలి యాత్మశక్తి మహాపిశాచమై - కాలకేతనుని తుదవఱకును వెంటాడినది. రాజస్యాలకుఁడగు నీలకంఠుఁడు రాజ్యాకాంక్షాతురుఁడై - రాజనాశనసంకల్ప మహాయజ్ఞమున కంకురార్పణము చేసినాఁడు. చోరశిఖామణియు, జూదరియు నగు మృగేశుఁడా యజ్ఞమునకు ఉపద్రష్టగా నిలువఁబడినాఁడు. చిన్నభార్య యగు మంగళ ప్రబోధనలు చెవికెక్కి - కాలకేతనుఁడు - మహాసాధ్వియగు పెద్దభార్యను సులోచనను ఘోరముగ హత్యచేసినాఁడు. భీషణమైన యారాత్రి - కాలకేతనజీవితమునం దొక మహాకాళరాత్రి; ఆరాత్రియే సులోచనావధానంతరమున విశ్వాసపాత్రభృత్యుఁడగు ఆగభాషి కాలకేతనునిభీకరకరవాలాగ్రమున నేలగూలినాఁడు. ఆరాత్రియే తండ్రియగు కాలకేతనుఁడు శాంతికేతనుని గ్రుడ్లుతీసినాఁడు! పాపము పండినది! ప్రకృతికాంత కాలకేతనుంజూచి వికృతహాసము గావించినది! దిశలు దద్దరిల్లినవి! మంగళా నీలకంఠ మృగేశుల ద్రోహములు రత్నహారమూలమున బయల్పడినవి! కాలకేతనము - మృత్యుసూచకమై అంబరస్థలమున సంచలించుచున్నది. సర్వజననాశనమొనరించి కాలకేతనుఁడు పశ్చాత్తాపశోకముచే ఆత్మహత్య చేసికొన్నాఁడు. చదువఁదగిన భయానక నాటకము !

వెల రు 1—0—0.

---

వలయువారు:—సరస్వతీ బుక్ డిపో, బెజవాడ,

అని వ్రాయవలెను.